
CHANDAMAMA
చందమామ



Kores
★ SUCCESS ★

# REWARD!



BRING 10 DIFFERENT WRAPPER STORIES AND THEIR WRAPPERS TO GET 3 MONOPACKS FREE

Big Babol

SOFT NON STICKY BUBBLE GUM

HURRY KIDS!

- Look out for wrapper stories inside Big Baból monopacks only
- Collect the reward from your nearest dealer
- Offer available in select cities

PERFETTI

McCann/PERFETTI/ 995




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## ప్రాథమిక పాఠశాలలు



ప్రకృతిశోభ నిండిన ప్రశాంత వాతావరణంలో పూర్వకాలంలో గురుకుల విద్యాభ్యాసం జరిగేదనీ, అక్కడ రాజా -- పేదా అనే భేదాలు పాటించేవారు కాదనీ తెలియజేసే పాత కథలు చాలా ఉన్నాయి. శిష్యులు గురువులకు శుశ్రూషలు చేస్తే, గురువులు శిష్యులకు కావలసిన సకల విద్యలూ నేర్పేవారు!

ఈనాటి పరిస్థితి అందుకు పూర్తిగా భిన్నం. చదువుల భారం పెరిగింది. నేర్చుకునే వేగం హెచ్చింది. విద్యావిధానం మారింది. కాకుంటే, నాటి గురుకులాలను తలపించే కొన్ని పాఠశాలలు మన గ్రామసీమలలో ఈనాటికీ అక్కడక్కడ చెట్లనీడలలో కనిపిస్తాయి!

ఇటువంటి ప్రాథమిక పాఠశాలలకు కనీస సౌకర్యాలను కల్పించాలని మన ప్రభుత్వం నిర్ణయించింది. అంటే, పిల్లలు కూర్చోవడానికి కనీసం రెండు మూడు గదులు గల భవనం; ఇద్దరు ఉపాధ్యాయులు; తరగతికి ఒక నల్లబల్ల; తాగడానికి మంచినీళ్ళు; చిన్న గ్రంథాలయం, మరుగుదొడ్డి – సమకూర్చాలని ఒక పథకం రూపొందించింది. దానికి పెద్ద మొత్తాలు కూడా ఖర్చయ్యాయి. అయితే, ఈ పథకం పూర్తిగా నెరవేరిందని చెప్పడానికి మాత్రం దాఖలాలు లేవు!

పట్టణ ప్రాంతాలలోని విద్యార్థులకు ఉన్నన్ని అధునాతన సౌకర్యాలు గ్రామాలకు విస్తరింపజేయడం కష్టంకావచ్చు. కాని, కనీస సౌకర్యాలనైనా కల్పించడం కష్టంకాదు. కాబట్టి ప్రభుత్వం దీనిని ప్రధాన కర్తవ్యంగా గుర్తించి, నెరవేర్చడం ఈనాటి పోటీప్రపంచంలో ఎంతయినా అవసరం!

సంపుటి : 97 జూన్ '95 సంచిక: 6

విడిప్రతి : 5.00 సంవత్సర చందా : 60.00



వార్తలు - విశేషాలు :

# ఫ్రాన్స్‌కు నూతన అధ్యక్షుడు

మే 17వ తేదీ ష్యాక్ చిరాక్ ఫ్రాన్స్ నూతన అధ్యక్షుడయ్యాడు. అంతకు పదిరోజుల క్రితం జరిగిన ఎన్నికలలో కన్సర్వేటివ్ గాలిస్ట్ పార్టీకి చెందిన చిరాక్ తన ప్రత్యర్థి సోషలిస్టు లయొనెల్ జాస్పిన్‌ను 52-48 శాతం ఓట్ల తేడాతో ఓడించాడు. చిరాక్ విజయం, 14 సంవత్సరాలు సాగిన సోషలిస్టు పరిపాలనకు స్వస్తి పలికింది. రెండవ ప్రపంచ యుద్ధానంతరం సుదీర్ఘ కాలం ఫ్రాన్స్ అధ్యక్ష పదవిని నిర్వహించిన ఫ్రాంకోయిస్ మిట్టెరాండ్, చిరాక్‌ను 1981లోనూ, 1988లోనూ జరిగిన అధ్యక్ష ఎన్నికలలో ఓడించాడు. అనారోగ్యం కారణంగా ఆయన ఈ సంవత్సరం పోటీ చేయలేదు.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం (1939-1945) జనరల్ చార్ల్స్ డిగాల్ ఫ్రాన్స్ అధ్యక్షుడై దేశంలో సుస్థిరతను నెలకొల్పడానికి ప్రయత్నించాడు. కాని ఆయనకు ఫ్రెంచి కాలనీలయిన ఇండోచైనా (ఇప్పటి వియత్నాం, కాంబోడియా, లావోస్‌లు), అల్జీరియాల నుంచి సమస్యలు ఎదురయ్యాయి. ఆయన మొదట ఆ దేశాల నుంచి ఫ్రెంచి సేనలను ఉపసంహరించుకున్నాడు. ఆ తరవాత స్వతంత్రం ఇచ్చాడు. అఖరికి 1968వ సం॥లో అధ్యక్ష పదవికి రాజీనామా చేశాడు. అయినా, ఆయన అనంతరం వచ్చిన వారిని కూడా 'గాలిస్ట్' సిద్ధాంతాలు చాలా ప్రభావితం చేస్తూ వచ్చాయి.

సోషలిస్టు నాయకుడు మిట్టెరాండ్ 1981వ సం॥లో ఫ్రాన్స్ అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. అప్పుడు తీవ్రమైన ద్రవ్యోల్బణం, నిరుద్యోగ సమస్య దేశాన్ని పట్టి పీడించేవి. అలాంటప్పుడు సోషలిస్టు నాయకుడు అధ్యక్షుడు కావడం ఒక శుభపరిణామంగా భావించి, మంచి భవిష్యత్తు ఉండగలదని ఆశించి ఫ్రాన్స్ ప్రజలు ఆనందంతో ఉప్పొంగిపోయారు. పధ్నాలుగేళ్ళ తరవాత ఇప్పుడు చిరాక్‌కు అధికారాన్ని అప్పగించారు.

1993వ సం॥లో జరిగిన పార్లమెంటు ఎన్నికలలో కన్సర్వేటివ్‌లకు మెజారిటీ లభించింది. గాలిస్ట్ పార్టీకి చెందిన ఎడ్వర్డ్ బల్లాదుర్ ప్రధానమంత్రి అయ్యాడు. ఈ స్వల్ప కాలంలో ఆయన నిరుద్యోగుల సంఖ్య తగ్గించడానికి కృషి చేశాడని చెబుతారు. కాని, ఇది నిజం కాదని విమర్శకులు భావిస్తున్నారు. బల్లాదుర్ కూడా అధ్యక్ష పదవికి పోటీ చేశాడు గాని మొదటి రౌండ్‌లోనే ఓడిపోయాడు. దాంతో ఆయన ప్రధానమంత్రి పదవికి రాజీనామా చేశాడు. ప్రస్తుతం చిరాక్ మాజీ విదేశాంగ మంత్రి అలైన్ జుప్పేను ప్రధానమంత్రిగా చేశాడు.

62 సంవత్సరాలు నిండిన ష్యాక్ చిరాక్ తన 30 ఏళ్ళ రాజకీయ జీవితంలో రెండుసార్లు -- అంటే, 1974 నుంచి 76 వరకూ, 1986 నుంచి 88 వరకూ ప్రధానమంత్రిగా ఉన్నాడు. అంతకు ముందు ఆయన వ్యవసాయ మంత్రిగా ఉన్నప్పుడు ఆపిల్ ఎగుమతికి ఎంతగానో కృషి చేశాడు. ఆ కారణంగా ఆపిల్ ఎగుమతిలో ప్రపంచంలో ఫ్రాన్స్ రెండవ స్థానానికి ఎదిగింది. చిరాక్ ప్యారిస్ నగర మేయర్‌గా ఉంటూ అధ్యక్ష పదవికి పోటీ చేశాడు. 'ఆపిల్'ను తన ఎన్నికల చిహ్నంగా స్వీకరించాడు.

మే 10వ తేదీ ఎన్నికల విజయోత్సవాన్ని జరుపుకున్న ప్రజలు 'మునుముందు పరిస్థితులు చక్కబడగలవని' నినాదాలు చేశారు. "నిరుద్యోగ సమస్యను నిర్మూలించడమే మన ప్రథమ కర్తవ్యం!" అని ప్రకటించాడు చిరాక్.





# పెద్దతనం

ఒక పెద్ద అడవి పక్కన వుండే ఆళ్ళవరం గ్రామంలోని సుబ్బారాయుడికి, ఎలాంటి పనిఅయినా సులభంగా సాధించుకు వస్తాడని మంచిపేరు. అవసరమైనప్పుడు గ్రామంలో చాలామంది ఆయన్నే ఆశ్రయించేవాళ్ళు. అందుకు సుబ్బారాయుడు విసుక్కోకుండా గర్వపడేవాడు.

ఇప్పుడు సుబ్బారాయుడి వయసు ఏభై దాటింది. అయినా తనలో ఓపికా, ఉత్సాహం ఏమాత్రం తగ్గలేదని ఆయన ఉద్దేశ్యం. కానీ గ్రామంలోని వాళ్ళు మాత్రం, కొత్తగా గ్రామంలోకి వచ్చిన నాగరాజును కష్టమైన పనులకు ఆశ్రయిస్తున్నారు.

ఇది సుబ్బారాయుడికి బాధను కలిగించింది. భార్య సూర్యావతికి చెప్పుకున్నాడు. ఆవిడ నవ్వి, "గ్రామంలోని వాళ్ళకు మీరంటే అపరిమితమైన గౌరవం. మీకు పెద్దతనం వచ్చింది. పూర్వంలా మిమ్మల్ని శ్రమపెట్టడం తగదని, వాళ్ళు యువకుడైన నాగరాజు చేత కష్టమైన పనులు చేయించుకుంటున్నారు," అన్నది.

ఇందుకు సుబ్బారాయుడు చిరుకోపంగా, "సమర్థతకు వయసేమిటి? ఆ నాగరాజు యువకుడు కావచ్చు. కానీ నా వల్ల కాని పనులు చేయలేదు. అతడిప్పుడు చేస్తున్న పనులూ నా అంత బాగా చేయడం లేదు. ఈ విషయం గ్రామం వాళ్ళకు తెలియదా?" అన్నాడు.

సూర్యావతి అప్పటికి ఊరుకుని, భర్త అన్నమాటలను తనకు తెలిసిన వారికి చెప్పింది. వాళ్ళు వెంటనే, "ఆశ్చర్యం! ఒకప్పుడు సుబ్బారాయుడిలాంటివి పట్టించుకునే వాడు కాదు. అప్పుడూ ఆయన కొక్కడికే కాదు, ఇలాంటి పనులు ఇతరులు కొందరికి అప్పజెప్పే వాళ్ళం. అవసరమైతే నా దగ్గరకే వస్తారు – అనేవాడు తప్ప, తన దగ్గరకెవరూ

రాయవరపు ఆదినారాయణరావు.

రావడం లేదని బాధపడేవాడు కాదు. పాపం, వయసు మీదపడుతోంది కదా! అలాగే అనుకుంటాడులే," అన్నారు.

సుబ్బారాయుడి కీవిషయం తెలిసి మరింత బాధపడ్డాడు. తను ఎప్పటిలాగే చలాకీగా, చురుకుగా వున్నాడనీ, తనకింకా పెద్దతనం రాలేదనీ అందరికీ తెలియాలని ఆయన కోరిక. అది తీరేదెలాగా అని ఆలోచిస్తూంటే అవకాశం రానే వచ్చింది.

ఆ రోజు సుబ్బారాయుడు, గ్రామాధికారి ఇంటి అరుగు మీద కొందరు పెద్దలతో మాట్లాడుతున్నాడు. అక్కడ నాగరాజు కూడా వున్నాడు. అంతలో అక్కడికి పొరుగూరి జమీందారు గారి దివాణం అధికారి వచ్చాడు. ఆయన్ని చూస్తూనే గ్రామాధికారి నమస్కరించి, "ఏమిటిలా దయచేశారు?" అంటూ కూర్చునేందుకు తన పక్కన చోటు చూపించాడు.

దివాణం అధికారి అక్కడున్న వారందరికేసి ఒకసారి చూసి గ్రామాధికారితో, "నాలుగైదు నెలలుగా మా జమీందారుగారి ఊళ్ళలోని జనాభా లెక్కలూ, ఊళ్ళ పొలిమేరల సమాచారం, చెరువులూ, వాగుల పరిస్థితీ–అంతా లెక్కలు తయారుచేశాను. ఆ మధ్య పట్నం వెళ్ళిన మా జమీందారుగారు రేపు సాయంకాలానికి తిరిగివస్తున్నారు. నేను సేకరించిన సమాచారం మూడువందల పుటలపుస్తకంగా తయారైంది. ఈ విషయంలో మీ నుంచి సాయం కోరివచ్చాను," అన్నాడు.



"మానుంచిసాయమా?అదేమిటోచెప్పండి!" అన్నాడు గ్రామాధికారి ఆశ్చర్యపోతూ.

"మీ గ్రామంలో చదువు సంధ్యల్లో బాగా ఆరితేరిన వాళ్ళున్నారని విన్నాను. నేను తయారు చేసిన సమాచారంలో అక్షరాల తప్పులూ, కూడికలూ హెచ్చవేతల్లాంటి వాటిల్లో దొర్లిన పొరబాట్లూ, తిరిగి నేనే సరిదిద్దుకోవడం కంటే, మరెవరైనాసమర్థులు ఆపని చెయ్యడం మేలనుకుంటున్నాను. ఎవరైనా అందుకు సాయం చేయాలి!"అన్నాడుదివాణం అధికారి.

"మా గ్రామంలో, ఉన్న లెక్కలూ అవీ సరిచూసి అర్థంచేసుకుని తప్పులేమైనా వుంటే దిద్దగల వారెందరున్నారు? అందుకు బహుశా నాగరాజే సమర్థుడు. ఏమయ్యా, నాగరాజూ!

వీరికి కాస్త సాయంచేయి. ఎప్పుడైనా జమీం దారుగారితో నీకు పని పడితే, అప్పుడు వీరి నుంచి నీకు సాయం వస్తుంది," అన్నాడు గ్రామాధికారి చటుక్కున. గ్రామాధికారి తన పేరు చెప్పనందుకు సుబ్బారాయుడు నొచ్చు కున్నాడు. ఇదివరలో ఇలాంటి పనులు ఆయన చాలా చేసివున్నాడు.

నాగరాజు మాత్రం, "వీరు సేకరించిన సమాచారమంతా శ్రద్ధగా చదివి అక్షరాల తప్పులూ, లెక్కల్లో దిద్దుబాట్లూ -- అంతా మూడువందల పుటలు సరిదిద్దాలంటే కనీసం పది రోజుల గడువు కావాలి. అంతపెద్దపని ఒక్కరోజులో చేయడం నావల్లకాదు,"అన్నాడు.

ఇది విని దివాణం అధికారి నిరుత్సాహ పడ్డాడు. అప్పుడు సుబ్బారాయుడు కలగజేసు కుని, "తమకు అభ్యంతరం లేకపోతే, ఆ పని నేను చేయగలను," అన్నాడు.

"తమరి గురించి విన్నాను. తమరందుకు సమర్థులే! కానీ కాస్త పెద్దతనం వచ్చిందని తటపటాయిస్తున్నాను. మీరు చేస్తానంటే నాకు సంతోషమే!" అని దివాణం అధికారి ఆయనకు పుస్తకం ఇచ్చాడు.

సుబ్బారాయుడు పట్టుదలతో కూర్చుని దాన్ని ఒక్కరోజులో సరిదిద్ది, దివాణం అధికా రికి తిరిగి ఇచ్చాడు.

ఆ తర్వాత దివాణం అధికారి దాన్ని జమీందారుకిచ్చాడు. జమీందారు దాన్ని క్షుణ్ణంగా చదివి ఎక్కడా తప్పంటూ లేదని అధికారిని మెచ్చుకోవడం, ఈ సంగతి ఆయన నలుగురికీ చెప్పడం జరిగింది.



"ఒక్కరోజు..... ఒక్కరోజంటే ఒక్కరోజులో దివాణం అధికారి ఇచ్చిన మూడు వందల పుటల పుస్తకాన్ని చదివి తప్పులు దిద్దాను. అందుకు ఇంత పిసరు కష్టమనిపించలేదు," అని సుబ్బారాయుడు అందరికీ చెప్తూకున్నాడు.

ఆ తర్వాత తన సమర్థతను నిరూపించుకునేందుకు సుబ్బారాయుడికి మరికొన్ని అవకాశాలు వచ్చాయి.

ఒకసారి గ్రామాధికారికి జబ్బు చేసింది. వైద్యానికి కొత్తరకం మూలికలు కావలసి వచ్చాయి. అవి చపలపురంలో వ్యాసానందుడనే వాడి దగ్గర తప్ప ఇంకెక్కడా దొరకవు. వైద్యుడు చెప్పిన రోగలక్షణాలను వాడితో చర్చించి, వాడిచ్చిన మూలికలు తీసుకురావాలి. వచ్చిన ఇబ్బందేమంటే – వ్యాసానందుడు సంస్కృతం తప్ప మరొక భాష వినడు, మాట్లాడడు!

గ్రామాధికారి నాగరాజును పంపాలనుకున్నాడు. కానీ చపలపురం వెళ్ళాలంటే ఉప్పుటేరు దాటాలి. ఉప్పుగాలి నాగరాజుకు పడదు. ఆ ప్రయాణం చేయాలంటే వారం రోజులు ముందు నుంచీ ఏవో మందులు మింగి, కొన్ని ఆహారనియమాలు పాటించాలి. అయితే ఇప్పుడంత వ్యవధిలేదు.

సుబ్బారాయుడు తనకు ఉప్పుటేరు బాధ లేదనీ, ఆ పని చేసుకురాగలననీ చెప్పి; చేసుకుని వచ్చాడు.

ఇంకొకసారిగ్రామంలోఅమ్మవారిసంబరం గొప్పగా చేయాలనుకున్నారు. సంబరం రోజున





పురుషులందరూ వయసుతో నిమిత్తం లేకుండా, రోజంతా అమ్మవారి విగ్రహం ముందు గెంతులు వేయాలి. నిలబడే వుండాలి తప్ప కూర్చోకూడదు. అలా చేస్తే మేలు జరుగుతుంది, చేయకపోతే కీడు జరుగుతుందని గ్రామ ప్రజల నమ్మకం.

ఆ గ్రామాన్ని ఆనుకుని వున్న అడవిలో ఒక ప్రత్యేకమైన చెట్టుంది. ఆచెట్టు ఆకులు అన్నీ ఒకరకంగా వుండవు. వాటిలో కొన్నింటి పై త్రిశూలం ఆకారంలో బొమ్మ వుంటుంది. అలాంటి ఆకులు నూట పదహారు తెచ్చి, అమ్మవారి మెడలో మాలగా వేసి సంబరం చేశాక, ఆ మర్నాడు తిరిగి ఆ మాలను అడవిలోని చెట్టు కొమ్మకు తగిలించాలి. ఎవరు ఆకులు తెచ్చారో వాళ్ళే మాలనూ తీసుకువెళ్ళాలి.

అడవి ప్రయాణం ఎంతో కష్టమైనది. అది చేశాక సంబరంలో పాల్గొనడం మరింత కష్టం. ఆ వెనువెంటనే మళ్ళీ అడవి ప్రయాణం చేయాలంటే ఇంకా కష్టం. అడవిలో ఆ చెట్టును వెదికి పట్టుకోవడం, చెట్టుకున్న త్రిశూలపు ఆకుల్ని గుర్తించడం అందరికీ సాధ్యమయ్యే పనికాదు.

ఈ పని నాగరాజు వల్ల అవుతుందికానీ, తానంత శ్రమపడలేనన్నాడు. సంబరంలో రోజంతా గెంతాలంటే, వాడికి ముందూ వెనకా విశ్రాంతి కావాలట! అలా గెంతకపోతే తనకు కీడు కలుగుతుందని వాడి భయం.

గతంలో సుబ్బారాయుడీ పని నాలుగైదు సార్లు చేశాడు. ఆయన తను మళ్ళీ ఆ పని చేస్తానని, అడవికి పోయి ఆకులు తెచ్చి— మిగతా పనికూడా సక్రమంగా నిర్వహించాడు. ఆయనలో అలసట మచ్చుకు కూడా కనిపించ లేదని అంతా చెప్పుకున్నారు. సూర్యావతి కూడా భర్త ఓపికకు మెచ్చుకుంది.

ఈ విధంగా సుబ్బారాయుడు ఎన్నో కష్ట మైన పనుల్లో, తను నాగరాజుకంటే అధికుడ నని నిరూపించుకున్నాడు. అయినా అందరూ ముఖ్యమైన పనులకు నాగరాజునే ఆశ్రయిస్తు న్నారు. వాడు కాదంటేనే సుబ్బారాయుడి వద్దకు వస్తున్నారు. ఇది ఆయనకు బాధగా వుండేది.

ఒకనాడు సూర్యావతి, సుబ్బారాయుడితో, "మీరు హాయిగా ఇంట్లో కూర్చుని పురాణ గ్రంథాలు చదవండి. వాటి అర్థం నాకు చెప్పండి. సుఖంగా వుందాం. ఇతరులు మీకు పని చెప్పకపోతే అందుకు సంతోషించాలి కానీ బాధపడతారెందుకు?" అన్నది.

"అందరూ నాకు పెద్దతనం వచ్చిందను కుంటున్నారు. ఆ మాట కొందరు మొఖానే అనేస్తున్నారు. నేనేమైనా మంచం పట్టానా? పైగా యువకులవల్ల కాని పనులు చేస్తున్నాను. ఆ విషయం ఎవరూ గుర్తించరేం?" అన్నాడు సుబ్బారాయుడు.



ఇలా వుండగా, ఎంతోకాలంగా సుబ్బారా యుణ్ణి ఎరిగున్న పొరుగూరి వాడైన వసురా యుడు వాళ్ళింటికి వచ్చాడు. వసురాయుడి గ్రామంలో రెండేళ్ళుగా వానలు లేవు. చెరు వులు, బావులు తవ్వించమంటే గ్రామాధికారి శ్రద్ధ తీసుకోవడంలేదు. రాజుకు ఫిర్యాదు చేయాలంటే ఒక ఇబ్బంది వుంది.

రాజధానికి వెళ్ళి, రాజప్రాసాదం ముం దున్న మైదానంలో, ఆయన్ని ఆకర్షించేటట్టు ఏదైనా కష్టమైన పనిచేసేవారినే రాజు పిలి పించి కారణమడుగుతాడు. అప్పుడు రాజుకు తను వచ్చిన పనేమిటో చక్కగా వివరించి చెప్పాలి.

"సాధారణంగా అందరూ రాజధాని మైదా నంలో మధ్య ఆగకుండా నూరు పిల్లిమొగ్గలు వేస్తారు. అలా వేయగలవాళ్ళు, మా ఊళ్ళో చాలా మంది వున్నారు. కానీ ఆ తర్వాత రాజుతో చక్కగా మాట్లాడాలి కదా! అందుకు తగిన సమర్థులు మా ఊళ్ళో లేక ఈ ఊరొ చ్చాను. నీ ఎరుకలో ఎవరైనా వున్నారా?" అని వసురాయుడు, సుబ్బారాయుణ్ణి అడి గాడు.

సుబ్బారాయుడిసామర్థ్యంగురించివసురా యుడికి తెలుసు. అయినా, తన సాయం అడక్కుండా మరెవరి పేరైనా చెప్పమన్నం దుకు ఉక్రోషం వచ్చి, ఆయన గ్రామాధికారిని అడగమన్నాడు.

వసురాయుడు,గ్రామాధికారి వద్దకు వెళ్ళి తిరిగి వచ్చి సుబ్బారాయుడితో, "గ్రామాధికారి నాగరాజు అనేవాడి పేరు చెప్పాడు. అంతే

కాదు. నువ్వేనాగరాజునుఈపనికిఒప్పించాలట," అన్నాడు.

దీనికి సుబ్బారాయుడు మండిపడి, "ఒక్క రోజులో దివాణం అధికారి రాసినదంతా చదివి ఒక్క తప్పులేకుండా దిద్దాను. ఉన్న పళంగా వెళ్ళాలంటే ఉప్పుటేరు ప్రయాణం చేసివచ్చాను. అమ్మవారి సంబరానికి, మూడు రోజులు వరసగా అంతులేని శరీర శ్రమ చేసినా అలిసిపోలేదు. ఇలాంటి నేనుండగా, ఆ నాగరాజే కావాలనుకుంటే నువ్వే వెళ్ళి వాణ్ణి అడుగు. రాయబారాలు నావల్ల కాదు," అన్నాడు.

వసురాయుడు ఆయనవంక ఆశ్చర్యంగా చూసి, "అయితే మీ గ్రామాధికారి చెప్పింది నిజమే!" అన్నాడు.

సుబ్బారాయుడు తెల్లబోయి, "నా గురించి గ్రామాధికారి ఏం చెప్పాడు నీకు?" అని అడిగాడు.

"ఇది వరకు నువ్వెంత కష్టమైన పని చేసినా, ఇతరులే ఆ కష్టం గురించి మాట్లాడే వారు. నువ్వు మాత్రం ఇదీ ఒక పెద్దపనా, ఇందులో కష్టమేముందీ అనేవాడివి. ఇప్పుడే పని చేసినా అదెంతో కష్టమైనదనీ, అయినా నువ్వు చేశాననీ అంటున్నావు. గ్రామాధికారి చెప్పినట్టు నీకు పెద్దతనం వచ్చేసింది. ఇలాంటప్పుడు నీకు విశ్రాంతి అవసరం!" అన్నాడు వసురాయుడు.

అప్పటికి సుబ్బారాయుడికి తనలో వచ్చిన మార్పు అర్థమయింది. కష్టమైన పనులు ఇప్పటికీ తను చేయగలుగుతున్నాడు కానీ గతంలోఅవికష్టమైనవని అనుకునేవాడు కాదు. ఇప్పుడా పనుల్లో కష్టమున్నదని తెలుస్తున్నది. తనకు పెద్దతనం వచ్చిందని ఇతరులు గుర్తించడం ఇష్టంలేదు. నాగరాజుకాబాధ లేదు. వాడు తను చేయగలిగింది చేస్తున్నాడు. చేయలేనిది స్పష్టంగా చెబుతున్నాడు. శక్తి సామర్థ్యాలు ఋజువు చేసుకోవాలన్న తపన వాడికి లేదు. పెద్దతనం వచ్చిన వారికే ఆ తపన వుంటుంది!

ఇది గ్రహించాక సుబ్బారాయుడు, మిగతా వాళ్ళ గుర్తింపు కోసం తాపత్రయ పడడం తగ్గించి సుఖంగా రోజులు గడిపాడు.






[గ్రీకులకూ ట్రోజనులకూ భువనసుందరి మూలాన ప్రారంభమైన యుద్ధం అవసాన దశకు వచ్చింది. ఉభయపక్షాలా ఉత్తమయోధులు మరణించారు. ట్రోయ్‌ని పట్టుకోవటానికి రూపధరుడు ఒక యుక్తి పన్నాడు. దాని ననుసరించి గ్రీకులు ఒక కొయ్యగుర్రం తయారుచేసి దాని కడుపులో కొందరు యోధులను ఉంచి, గుర్రాన్నీ, చౌర్యనాథుడనే వేగులవాణ్ణీ, సముద్రతీరాన వదిలి తమనౌకలలో వెళ్ళిపోయినట్టు నటించారు. ట్రోజనులు ఆగుర్రాన్ని తమ నగరంలోకి తెచ్చుకుని, విజయోత్సాహంలో మునిగి ఉన్నారు.]

బయట ఈ తతంగమంతా జరుగుతూ ఉంటే, గుర్రంలోపల ఉన్న గ్రీకుయోధులు ప్రాణాలరచేతపట్టుకుని గడగడలాడిపోయారు. దోర్దండుడు నిశ్శబ్దంగా ఏడవసాగాడు కూడా. నవయోధు డొక్కడే రాయిలాగా ఉండిపోయాడు. తీక్ష్ణదృష్టి విసిరిన బల్లెం కొయ్యగుర్రాన్ని భేదించి తన తలకు సమీపంలోనే పొడుచుకువచ్చినా అతను చలించలేదు. పైపెచ్చు, ఎప్పుడు బయటపడి తన పరాక్రమం చూపుదామా అన్నట్టుగా, తన కత్తి పిడిని చేతితో పట్టుకుని, మాటిమాటికీ రూపధరుడి కేసి చూడసాగాడు. ఈ దాడికి నాయకుడు రూపధరుడే.

సాయంకాలంవేళ భువనసుందరి తన భర్త అయిన అరిభయంకరుడితో సహా గుర్రాన్ని చూడవచ్చింది. ఆమె తన భర్తను రంజింపజేసే మిషమీద గుర్రంచుట్టూ తిరిగివస్తూ, మధ్య మధ్య దాన్ని తట్టుతూ,



ఒక గుండ్రని దీపం వెలుగుతున్నది. ఇది గ్రీకుల కోసం ఏర్పాటుచేసిన సంకేతం.

అర్ధరాత్రి అయింది. చంద్రోదయం కాబో తున్నది. ఆ సమయాన చౌర్యనాధుడు పిల్లి లాగా నగరం దాటి వెళ్ళి, వజ్రకాయుడి సమాధివద్ద అఖండం వెలిగించాడు. అదే సమయాన ప్రత్యామ్నాయుడు, సముద్రం మీద దూరాన వేచిఉన్న గ్రీకునౌకలు బయలు దేరి రావచ్చు నన్నట్టుగా, ఒక దివిటీ ఊపాడు.

సంకేతం అందినట్టుగా రారాజు తమ నౌకలలో దీపాలు వెలిగించాడు. గ్రీకు నౌకలు తీరానికేసి రాసాగాయి.

రారాజు సంకేతం చూస్తూనే ప్రత్యామ్నా యుడు కొయ్యగుర్రం వద్దకు వెళ్ళి చిన్న గొంతుతో, "అంతా సిద్ధం!" అని లోపలివాళ్లకు తెలిపాడు. వెంటనే రూపధరుడు దోర్దండుడి తో, "గుర్రం తలుపు తెరిచెయ్యి!" అన్నాడు.

గుర్రంలో ఉన్న యోధులలో ఒక్కొక్కడి భార్య గొంతునూ అనుకరించింది. వారిని పేర్లుపెట్టి పిలిచింది కూడా. గుర్రం కడుపులో, రూపధరుడికి సమీపంగా కూచుని ఉండిన ప్రతాపుడూ, దేవమయుడూ కూడా, ఆమె తమ పేర్లు పిలిచినప్పుడు లేచి బయటికి ఉరకబోయారు! వారిని రూపధరుడు సకాలం లోవారించాడు.

రాత్రి అయింది. పగలల్లా విజయోత్సవాలు జరిపి అలిసిపోయిన ట్రోయ్ పౌరులు ప్రాణాలు సొమ్మసిల్లి గాఢనిద్రలో మునిగి పోయారు. ఎక్కడా ఒక్క కుక్కకూడా మొర గటంలేదు. ఒక్క భువనసుందరి మాత్రం మేలుకుని ఉన్నది. ఆమె గదికి వెలుపల

గుర్రం డొక్కలో తలుపు తెరుచుకున్నది. ఒక యోధుడు ఆత్రంగా బయటికి దూకి, మెడ విరిగి అక్కడే చనిపోయాడు. తరవాత తాటినిచ్చెన బయటికి వచ్చింది. గ్రీకు యోధులు ఒక్కొక్కరే నిశ్శబ్దంగా దిగి వచ్చారు. వారిలో కొందరు నౌకలలో వచ్చేవారికోసం కోట ద్వారాలు తెరవటానికి పరిగెత్తారు, మరికొందరు రాజసౌధం వెలుపల నిద్రమత్తు తోజోగుతున్న పహరావాళ్ళ మీదపడి చంపే శారు.

ప్రతాపుడికి తన భార్య అయిన భువన సుందరి ఆలోచన తప్ప మరొక ఆలోచన లేదు; ఆయన భువనసుందరి ఉండే ఇంటి కేసి పరిగెత్తాడు.

ఆ తరవాత బీభత్సం ఆరంభమయింది. వెన్నెలలో గ్రీకువీరులు వీధులవెంట బయలు దేరి దారుణహత్యాకాండ ప్రారంభించారు. నిరాయుధుల జోలికి పోమని రూపధరుడు భువనసుందరికీ, ఆమె అత్తగారికీ మాట ఇచ్చాడేగాని, గ్రీకులు ఈ మాట దక్కించుకో లేదు. వారు ప్రతి ఇంటిలోకీ జొరబడి నిద్ర పోతున్నస్త్రీ,వృద్ధులగొంతులుకూడాకోసేశారు.

వర్ధనుడూ, ఆయన భార్యా, కూతుళ్ళూ ఒక ఆలయంలో వెళ్లి దాక్కున్నారు. వర్ధనుడు గ్రీకులతో తలపడటానికి సిద్ధమైనాడు గాని ఆయన భార్య బతిమాలింది. "నీవు వృద్ధు డివి. ఇప్పుడు వెళ్ళి ఏమి యుద్ధం చేస్తావు? ప్రాణాలతో ఉండు, అదే పది వేలు!" అన్నది.

వర్ధనుడు భార్య మాటలు మన్నించాడు. కాని అంతలోనే, తన కుమారులలోనే ఒకణ్ణి గ్రీకులు తరుముకుంటూ రావటమూ, నవ యోధుడు అతన్ని పొడిచి చంపటమూ ఆయన కళ్లపడింది. ఇది చూసి సహించలేక వర్ధనుడు ఆలయంనుంచి బయటికి ఉరికి, గ్రీకులకు దొరికిపోయాడు. గ్రీకులు ఆయ నను రాజభవనం వద్దకు ఈడ్చుకుపోయి ద్వారంవద్ద చంపేశారు.





భువనసుందరి ఇంటికి ప్రతాపుడితో బాటు రూపధరుడుకూడా వెళ్ళాడు. ఆఇద్దరూ కలిసి అరిభయంకరుడితో చాలాసేపు యుద్ధం చేశారు. చివరకు భువనసుందరే అరిభయం కరుణ్ణి వెనకపాటున పొడిచింది. అతను చనిపోయాడు.



ప్రతాపుడు తన భార్యను, దొరకగానే చంపుదామనే ఇంతకాలమూ అనుకుంటూ వచ్చాడుగాని ఆమె నవమోహనాకారం చూడ గానే ఆయన బుద్ధి మారిపోయింది. ఆయన తన కత్తిని విసిరిపారేసి. భువనసుందరిని చెయ్యిపట్టుకుని తమ నౌకల వద్దకు తీసుకు వెళ్ళాడు.

ప్రత్యామ్నాయుడు ట్రోజను అయివుండి కూడా గ్రీకులకు తోడ్పడినవాడు. ఈ సంగతి మరిచిపోయి కొందరు గ్రీకులు ప్రత్యామ్నా యుడు కొడుకులలో ఒకణ్ణి గాయపరిచారు. మరొకణ్ణి చంపటానికి వీధులవెంట తరమ సాగారు. ఈ సమయంలో రూపధరుడు అడ్డుపడిప్రత్యామ్నాయుడి కొడుకులను కాపా డటమే గాక, ప్రత్యామ్నాయుడి ఇంటి ద్వారా నికి ఒక చిరుతపులి చర్మం వేల గట్టించాడు. గ్రీకులు ఆ ఇంటిజోలికి పోకూడదనటానికి అది గుర్తు. ఇదేవిధంగా ప్రశంసనుడి ఇల్లు కూడా గ్రీకుల ఆగ్రహానికి గురికాకుండా వదిలివేయబడింది.

ట్రోయ్‌నగరంలో గ్రీకులు హత్యాకాండ ఆరంభించగానే, వర్ధనుడి పెద్దకుమార్తె అయిన జాలిని బుద్ధిమతీదేవి ఆలయానికి పరిగెత్తిపోయి దాక్కున్నది. కాని గ్రీకులు ఆమెను పట్టుకుని తీసుకుపోయినారు. ప్రాణా లతో చిక్కిన ట్రోజను స్త్రీలందరూ గ్రీకులకు లొంగిపోవటం తప్ప గత్యంతరం లేదు. జాలి నిని రారాజు తీసుకున్నాడు.

హత్యాకాండ ముగిసినాక గ్రీకులు ట్రోయ్ నగరాన్ని కొల్లగొట్టారు, గోడలు పడగొట్టారు, ఇళ్లకు నిప్పుపెట్టారు, దేవతలకు బలులు పెట్టారు, దోచినదల్లా పంచుకున్నారు.

వీరసింహుడి భార్య నవయోధుడి వంతు అయింది. ఆమె కొక పసిపిల్లవాడున్నాడు. వాణ్ణి గ్రీకు యోధులందరూ కూడబలుక్కుని రహస్యంగా చంపేశారు.



వజ్రకాయుడు ప్రేమించిన ప్రమోదిని భవిష్యత్తుగురించి గ్రీకుల మధ్య కొంత వాగ్వాదాలు జరిగాయి. "ట్రోయ్ పతనమైన తరవాత ప్రమోదినిని నా సమాధివద్ద బలి ఇవ్వండి!" అని చనిపోతూ వజ్రకాయుడు తన మిత్రులను కోరిఉన్నాడు. అతను ఇటీవల తన కొడుకుకూ, మరికొందరు గ్రీకులకూ కలలో కనిపించి, ప్రమోదినిని బలి ఇవ్వకపోతే గ్రీకు బలాలకు స్వదేశానికి వెళ్ళే ప్రాప్తి లేకుండా చేస్తానని బెదిరించాడుట.

అంతగా ప్రేమించిన ప్రమోదినిని వజ్రకాయుడికి అర్పించకపోవటం అపచారమవుతుందని కాంశుకుడు అన్నాడు. కాని రారాజు ప్రమోదిని బలికి పూర్తిగా వ్యతిరేకించాడు.

"ఇప్పటికే చాలా రక్తపాతం జరిగింది! అదీగాక చచ్చిపోయినవాడి హక్కులను బతికి ఉన్న స్త్రీతోముడిపెట్టటమేమిటి? ఇది చాలా అసంగతంగా ఉన్నది," అని ఆయన వాదించాడు.

"నీవంతు వచ్చిన జాలినిని తృప్తిపరచటానికై, ఆమె చెల్లెలి ప్రాణాలకు అడ్డుబడుతున్నావు!" అని కొందరు గ్రీకులు రారాజును బహిరంగంగా ఆక్షేపించారు. వాదం కాస్తా తగాదాగా మారింది. ఇంక ప్రమాదం జరుగుతుందని రూపధరుడు అడ్డుతగిలి, మిగిలిన వారి ఇష్టానుసారం జరగనిమ్మని రారాజుకు సలహా ఇచ్చాడు.

ప్రమోదినిని బలి ఇవ్వటం ఖాయమయింది. ఆమెను తీసుకువచ్చే పని రూపధురుడికే వప్పజెప్పారు. బలికర్తగా వజ్రకాయుడి కొడుకు నవయోధుడే స్వయంగా నిలబడ్డాడు. గ్రీకు సైనికులందరి సమక్షంలో, వజ్రకాయుడి సమాధివద్ద, ప్రమోదిని బలి చేయబడింది. తరవాత ఆమెకు గ్రీకులు శాస్త్రోక్తంగా అంత్యక్రియలు జరిపారు.

ప్రమోదిని చనిపోగానే గాలులు గ్రీకుల తిరుగు ప్రయాణానికిఅనుకూలంగా వీచాయి. ప్రమోదిని హత్యతో వజ్రకాయుడి ఆత్మ శాంతించిందనీ, అతనే ఆ గాలిని పంపి తమకు సాయపడ్డాడనీ గ్రీకులు భావించారు. వారు కాలయాపన కాకుండా, వెంటనే తమ నౌకలలో ఎక్కి తిరుగు ప్రయాణం మీద బయలుదేరారు.

వర్ధనుడి భార్య రూపధరుడివంతు అయింది. కాని ఆమె గ్రీకుల అవినీతికి కడుపుమండి రూపధరుడు మొదలైనవారి నందరినీ ఘోరంగా శాపనార్థాలు పెట్టసాగింది. ఏ విధంగానూ ఆమె నోరు మూయలేక గ్రీకులు ఆమెను చంపి సముద్రంలో పారేసి ముందుకు సాగివెళ్లారు.

తిరుగు ప్రయాణంలో గ్రీకు ప్రముఖులు తలా ఒకదారీ అయినారు. వారిలో కొందరు తమ దేశాన్ని చేరనేలేదు.

ట్రోయ్ నుంచి కదిలిపోయే ముందు రారాజుకూ, ఆయన తమ్ముడైన ప్రతాపుడికీ మధ్య తగాదా వచ్చింది. "గాలి అనుకూలంగా ఉన్నది, వెంటనే ప్రయాణమవుదాం!" అన్నాడు ప్రతాపుడు. "బుద్ధిమతీదేవికి బలు లివ్వకుండాపోతామా?" అన్నాడు రారాజు.

"బుద్ధిమతీదేవి మనకేం ఒరగ బెట్టిం దని బలులిస్తాం? ఆమె మన శత్రువులకే తోడ్పడింది!" అన్నాడు ప్రతాపుడు. ఆ తగాదాలో ఇద్దరూ చీలిపోయారు.వారు తిరిగి జీవితంలో కలుసుకోనేలేదు.

రారాజూ, నవయోధుడూ, వృద్ధుడైన నవద్యోతుడూ, నేరుగా ఇంటికి తిరిగి వెళ్లారు. ప్రతాపుడు మాత్రం గాలి అనుకూలించక తుపానులో చిక్కుకుని, తన నౌకలను చాలాభాగం పోగొట్టుకుని, ఈజిప్టు తీరం చేరి, అనేక సంవత్సరాల అనంతరం భువనసుందరితో సహా ఇల్లు చేరేలోగా రారాజును ఎవరో హత్య చేసేశారు.

ట్రోయ్ యుద్ధం ఆఖరుదశలో కొయ్య గుర్రం పథకం ఆలోచించి, ట్రోయ్ పతనం కావటంలో గొప్ప పాత్ర నిర్వహించిన రూపధరుడు ఇంటికి చేరటానికి పదేళ్లు పట్టింది. అతని ప్రయాణాలు అతి విచిత్రమైనవి.

ఈ విధంగా ట్రోయ్‌నగరం పతనమయింది. గ్రీకులు ధ్వంసం చెయ్యక పూర్వం అది ప్రపంచంలో గల ఉత్తమ నగరాలలో ఒకటి. గ్రీకులు నాశనం చేసిన అనంతరం దానిని పునర్నిర్మించి ఎందరో రాజులు – ప్రశంసనుడి సంతతివారు – ఏలారు గాని, దాని పూర్వపు ఔన్నత్యం ఎన్నడూ తిరిగి రాలేదు. —[అయిపోయింది]



# చందమామ కబుర్లు

## 14-ఏళ్ళ సైకిలు ప్రయాణం!

1981వ సం॥లో అహ్మదాబాదుకు చెందిన తహేర్ మద్రాస్‌వాలాకు ఆరు నెలల పాటు సైకిల్ ప్రయాణం చేయడానికి అతని తల్లిదండ్రులు అనుమతి ఇచ్చారు. అప్పుడు అతని వయసు 18 సంవత్సరాలు. అతడు ఆరు నెలల ప్రయాణం తరవాత ఇంటికి తిరిగి రాలేదు. ప్రయాణాన్ని పధ్నాలుగేళ్ళు కొనసాగించాడు. 116,000 కి.మీ. దూరం సైకిలు మీద ప్రయాణం చేసి 30 దేశాలు తిరిగి వచ్చాడు. కేవలం సైకిలు ప్రయాణం చేయడమే కాకుండా ఆయా ప్రాంతాల విశేషాలను సేకరించాడు. ఫోటోలు తీశాడు. తాను చూసిన ప్రదేశాలను,కలుసుకున్న మనుషులను వివరిస్తూ వీడియో చిత్రాలు తీశాడు. అతడు తన అనుభవాలను రాయ దలుచుకుంటే అదొక మంచి ఆసక్తి కరమైన పుస్తకంగా తయారవుతుంది!



## వెండి బైబిలు

స్టాక్‌హోమ్ ఉప్సాలా విశ్వవిద్యాలయంలోని బైబిలు గ్రంథంలో రెండు పేజీలూ, పై అట్టా గత ఏప్రిల్ 5వ తేదీ నుంచి కనిపించలేదు. ఒక నెల తరవాత ఆ పేజీలు స్టాక్‌హోమ్ మెయిన్ రైల్వే స్టేషన్ లాకర్స్‌లో భద్రంగా ఉన్నట్టు టెలిఫోన్ ద్వారా తెలియ వచ్చింది. ఆ బైబిలు పేజీలు సుప్రసిద్ధమైన వెండిబైబిలులోనివి. 6వ శతాబ్దానికి చెందిన ఆ పవిత్రగ్రంథంలోని అక్షరాలు వెండి సిరాతో రాయబడినవి. కొన్ని అక్షరాలకూ, పుటల అంచులకూ బంగారం ఉపయోగించారు. 17వ శతాబ్దంలో స్వీడిష్ సైనికులు ఆ గ్రంథాన్ని ప్రాగ్ (జెకోస్లోవేకియా) నుంచి దొంగిలించి తెచ్చారని చెబుతారు. గోథిక్ భాషలో రాయబడిన ఆ అరుదైన గ్రంథం అప్పటి నుంచి స్వీడన్‌లోనే ఉన్నది.

## నాలుగేళ్ళ కుర్రాడి సాహసం!

మే 19వ తేదీ సన్నీ కనోడియా బొంబాయి వీధులలో కారు నడిపాడు. అంతకు ముందు అంటే, మే 7వ తేదీ కలకత్తాలో కారు నడిపాడు. ఇంకా ముందు అహ్మదాబాదు, నౌగాన్, గౌహతి, సూరత్ నగర వీధులలో కారు నడిపి అందరినీ ఆశ్చర్యపరిచాడు. ఇంతకూ కనోడియా ఇంకా నర్సరీ తరగతిలోనే చదువుతున్నాడు. అతని వయసు నాలుగేళ్ళే! 1993వ సం॥లో హైదరాబాదుకు చెందిన నాలుగేళ్ళ జూహీ అగర్వాల్ కారు నడిపాడని తల్లిదండ్రులు చెప్పడంతో, "నా వల్ల మాత్రం ఎందుకు కాదు!" అన్న పట్టుదలతో కనోడియా తండ్రి దగ్గర కారు నడపడం నేర్చుకుని పలు నగరాలలో నడిపి సరికొత్త రికార్డు సృష్టించాడు. అతని పేరు గిన్నిస్ బుక్‌లో రికార్డు కానున్నది!





# అవసరానికి తగిన కోరిక

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రివేళ విషసర్పాలూ, నక్కలూ, గూబలూ మాత్రమే తిరుగాడే, ఈ భీతిగొలిపే శ్మశానంలో, పట్టువదలని నీ కార్యదీక్ష అభినందించదగిందే. అయితే, ఇంత నీ కఠోరశ్రమా ఏ మునీ లేక మాంత్రిక, తాంత్రికుల కోసమైతే మాత్రం చివరకు నిరాశపాలు కాగలవు. ఎందుకంటే — అలాంటివాళ్ళు అమానుష, అతీంద్రియ శక్తులను సాధించే ప్రయత్నంలో, సామాన్య మానవుల జీవితాల్లోని ఒడిదుడుకులూ, దురాశలూ, భయాలూ గ్రహించలేని అశక్తులవుతారు. ఆకారణంగా, వాళ్ళుసాధించిన అపూర్వ శక్తుల ప్రభావం అపాత్రులపరమైపోతుంది. ఈ విషయంలో నీకు ముందే హెచ్చరికగా

## బేతాళ కథలు



వుండేందుకు, మతంగుడనే ముని కథ చెబు తాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం తూర్పు సముద్రతీరంలోని ఒకా నొక గ్రామంలో, రాజయ్య అనే సంపన్నుడుండే వాడు. ఎంతో బాగా బ్రతికిన అతను క్రమంగా ఆస్తులన్నీ పోగొట్టుకున్నాడు. కొడుకు సీత య్యకు ఇరవై ఏళ్ళ వయసు వచ్చేసరికి, ఆయనకు ఇల్లొక్కటే మిగిలింది. దిగులుతో మంచం పట్టి ఒకరోజు కొడుకును పిలిచి, "నాయనా! నా అత్యాశవల్లే మనకీ గతి పట్టింది. నీ విషయంలో అలా జరక్కూడదు. ఇరవై సంవత్సరాలు నీకు నిండాక వచ్చిన రథసప్తమి నాడు, నీవు సుఖపడే ఉపాయం చెప్పాలని ఎదురు చూస్తున్నాను. ఈరోజే రథ సప్తమి. నువ్వు స్నానం చేసి శుచిగా నాదగ్గరకు రా!" అన్నాడు.

సీతయ్య స్నానానికి బయల్దేరబోగా తల్లి రాజమ్మ వాడితో, "అన్నట్టు మరిచాను. ఈ రోజు రథసప్తమి. స్నానం చేసేటప్పుడు తల మీద జిల్లేడాకులు, రేగుకాయలు ఉంచుకో వాలి," అని చెప్పింది.

జిల్లేడాకులు సీతయ్యకు ఒకపట్టాన దొరక లేదు. అందువల్ల స్నానం బాగా ఆలస్యమ యింది. అసరికి రాజయ్య మరణించాడు. రాజమ్మ, సీతయ్య భోరున ఏడ్చారు. ఆ ఏడ్పులు విని చుట్టుపక్కలవాళ్ళు వచ్చారు. నలుగురి సాయంతోనూ సీతయ్య, తండ్రికి దహనసంస్కారం చేశాడు.

ఆరోజు గడిచింది. మర్నాడు తెల్లవారగానే అప్పులవాళ్ళు రాజయ్య ఇంటిని చుట్టుము ట్టారు. రథసప్తమి వెళ్ళిన మర్నాడు తన కొడుకు అందరికీ బాకీలు తీర్చుతాడని రాజయ్య నమ్మకంగా చెప్పాడట. ఇప్పుడు వాళ్ళందరూ బాకీలు తీర్చమంటూ సీతయ్యను నిలవేశారు.

తండ్రి తనకేదో ఉపాయం చెబుతానన్నా డనీ, అది చెప్పేలోగానే మరణించాడనీ సీతయ్య ఎంత చెప్పినా వాళ్ళు వినిపించు కోలేదు. వాళ్ళందరూ కలిసి పెద్ద గొడవ చేస్తుంటే సీతయ్య దిగులుగా కూర్చున్నాడు.

అప్పుల వాళ్ళలో రమణయ్య అనే పెద్ద మనిషి వున్నాడు. రాజయ్య ఆయనవద్ద తన

ఇంటిని తాకట్టు పెట్టాడు. రమణయ్య మిగిలిన వాళ్ళతో, "మీవన్నీ చిల్లర బాకీలు. అవి నేను తీర్చుతాను. ఈ ఇంటిని నేను సామగ్రితో సహా స్వాధీనం చేసుకుంటాను. ఇందుకు మీకు అంగీకారమైతే చెప్పండి," అన్నాడు.

అందరూ ఈ ఏర్పాటు బాగుందన్నారు. అప్పుడు రమణయ్య, "ఒక్క రోజులో నువ్వు, నీ తల్లి కట్టుగుడ్డలతో ఈ ఇల్లు విడిచిపెట్టాలి. నేను సరిగ్గా రేపు ఉదయం ఇక్కడికి వస్తాను," అని సీతయ్యను గట్టిగా హెచ్చరించి, మిగతా అప్పులవాళ్ళను వెంటబెట్టుకుని వెళ్ళిపోయాడు.

జరిగినదంతా చూస్తున్న రాజమ్మ, "మనకు కానికాలం వచ్చిపడింది, నాయనా! ఇంటి అటక మీద తాతల కాలం నాటి పాత చెక్క పెట్టె ఒకటి వున్నది. అది ఒక్కటీ తియ్యి. ఆ పెట్టెను మాత్రం వెంటవుంచుకుని ఇక్కణ్ణించి వెళ్ళిపోదాం!" అని కొడుకుతో అన్నది.

సరేనని సీతయ్య అటక ఎక్కాడు. అక్కడ రకరకాల పాత సామగ్రి వున్నది. ఒకమూలగా పాత చెక్కపెట్టె కనబడింది. అందులో ఏముందోనని మూత తెరిచి చూశాడు. ఒక చిన్న పుస్తకం తప్ప వాడికింకేమీ కనబడలేదు.

సీతయ్య ఆ పుస్తకం తెరిచి చూశాడు. చాలా తక్కువ పుటలున్న ఆ పుస్తకంలో, సీతయ్య వంశ చరిత్ర వున్నది. సీతయ్య పుట్టుక వరకూ ముఖ్యమైన వివరాలున్నాయి. ఆ తర్వాత ఒక పుటలో, "బాదరాయణం,



బాదరాయణం, బాదరాయణం" అన్నమంత్రాన్ని మూడుసార్లు జపించుకుంటే, ఎదురుగా వున్న శత్రువులు కూడా మిత్రులై మనకు అడిగినంత సాయంచేస్తారనీ, అది ఆ కుటుంబానికి ప్రత్యేకమనీ రాసి వుంది. ఆ తర్వాత ఆ పుస్తకంలో ఇంకేమీ రాసిలేదు కానీ, బాదరాయణం మంత్రం గురించి అంత్యకాలం సమీపించేదాకా ఇంకెవ్వరికీ చెప్పరాదన్న హెచ్చరిక మాత్రం వున్నది. మరణించే ముందు తండ్రి తనకు చెప్పాలనుకున్న ఉపాయమిదేనని సీతయ్య గ్రహించాడు. వాడు అటక దిగి వెంటనే ఉత్సాహంగా రమణయ్య ఇంటికి వెళ్ళి, ఆయనను పలకరించి బాదరాయణం అని మనసులో మూడుసార్లు అనుకున్నాడు.



సతమతమయింది. సీతయ్య ఆమెకు కారణం చెప్పలేదు.

ఇల్లు నిలబడింది. అప్పుల బెడద వదిలింది. ఇక రోజు గడవాలి. అందుకు సీతయ్య దుకాణాదారు మదనుడి వద్దకు వెళ్ళి, బాదరాయణమంత్రం జపించాడు. మదనుడు రోజూ ఉచితంగా సీతయ్యకు వెచ్చాలు పంపుతానన్నాడు.

అలా కొద్దిరోజులు గడిచాయి. ఒకరోజు రాత్రి సీతయ్య ఇంట్లో దొంగ పడ్డాడు. అలికిడికి తల్లీ కొడుకులకు మెలకువ వచ్చింది. దొంగ వాళ్ళకు కత్తిని చూపి బెదిరించాడు. సీతయ్య మనసులో బాదరాయణ మంత్రం చదువుకున్నాడు.

అప్పుడు దొంగ వెంటనే, "నాకెవ్వరూ లేరు. ఈ రోజునుంచీ దొంగతనాలు మాని, ఏదైనా పని చేసుకుని బ్రతుకుతాను," అని ఆ తల్లీ కొడుకులకు చెప్పి వెళ్ళిపోయాడు.

"అంతా చిత్రంగా వుంది. అందరూ మనకిలా ఎందుకు సాయపడుతున్నారో అర్థం కావడం లేదు. నువ్వు కానీ వశీకరణమంత్రమేదైనా నేర్చుకున్నావా?" అని రాజమ్మ, సీతయ్యనడిగింది.

"లేదమ్మా! నాన్న చనిపోయినా ఆయన ఆత్మ మనకు సాయపడుతున్నట్టుంది!" అని సీతయ్య తల్లికి సర్ది చెప్పాడు.

సీతయ్యకు రోజులు మహాసుఖంగా వెళ్ళిపోతున్నాయి. వాడు తనకు ఎవరివల్ల ఏ

అప్పుడు రమణయ్య వాడిని ఆప్యాయంగా పలకరించి, "మీ నాన్న ఎంతో మంచివాడు. నీకు రాకూడని కష్టం వచ్చింది. నీకేం కావాలో చెప్పు, నేను సాయపడతాను," అన్నాడు.

"నా అప్పుల బాధ తీర్చు," అన్నాడు సీతయ్య వెంటనే.

"దేవుడి దయ వల్ల నాకే లోటూ లేదు. కాబట్టి నా బాకీని నేను వదులుకుంటాను. నీ చిల్లరబాకీలన్నీ తీర్చుతాను, వెళ్ళి సుఖంగా వుండు," అన్నాడు రమణయ్య.

తర్వాత ఆయన అన్న మాట నిలబెట్టుకున్నాడు కూడా!

ఉన్నట్టుండి రమణయ్యలో అంత మార్పు ఎందుకు వచ్చిందో అర్థం కాక రాజమ్మ

సాయం కావలసి వచ్చినా, బాదరాయణమం త్రంతో సాధించుకుంటున్నాడు. గ్రామాధికారికి కూడా లేని పలుకుబడి వాడికున్నదని అందరూ విచిత్రంగా చెప్పుకోసాగారు.

ఇలా వుండగా — ఆ ఊరికి మతంగుడనే మహాముని వచ్చాడు. ఆయనవద్ద ఎన్నో మహిమలున్నాయి. ఊళ్ళో ఎందరికో జబ్బులు కుదిర్చాడు. కొందరికి వరాలిచ్చాడు. ఆయ నకు సాధ్యం కాని పనిలేదని ఊరంతా చెప్పు కున్నారు.

ఈవిషయం సీతయ్యకు తెలిసింది. బాద రాయణమంత్రంతో ఆయనను వశపరుచు కుంటే, ఈ ప్రపంచంలో తను సాధించలేనిది వుండదని వాడికి తోచింది. అందుకని వాడు ఒకరోజున ఆయనను కలుసుకుని బాదరా యణమంత్రం జపించాడు.

మతంగుడు వాడివంక ప్రసన్నంగా చూసి, "అదృష్టజాతకుడివి, నాయనా! నీకు నా అవ సరమేముంది?" అన్నాడు.

"స్వామీ! ఎందరో సామాన్యులు నాకు సాయపడుతూ, నా అవసరాలు తీర్చుతున్నారు. అందువల్ల సామాన్యమైన నా కోర్కెలు తీరు తున్నాయి. మీవంటి వారు నాకు సాయపడితే, అసామాన్యమైన కోర్కెలు తీర్చుకోవచ్చునని ఆశ!" అన్నాడు సీతయ్య వినయంగా రెండు చేతులూ జోడించి.

మతంగుడు నవ్వి, "నాకథ విను నాయనా!" అంటూ ఇలా చెప్పాడు:



ఈ ప్రపంచానికి చక్రవర్తి కావాలని మతం గుడి ఆశ. ఆయన హిమాలయాలకు వెళ్ళి కఠోరమైన తపస్సు చేశాడు. కొంత కాలానికి భగవంతుడు ప్రత్యక్షమయ్యాడు. మతంగు డాయనకు తన కోరిక చెప్పుకున్నాడు.

"ఇప్పటి చక్రవర్తి చాలా మంచివాడు. ఆ పదవికి తగినవాడు. నీవా పదవిని కోరడం న్యాయం కాదు," అన్నాడు భగవంతుడు.

"నేను కూడా మంచివాణ్ణి. ఆ పదవికి తగినవాణ్ణి," అన్నాడు మతంగుడు.

"నీ మంచితనానికి ఋజువు లేదు. నువ్వు చక్రవర్తివి కావాలనుకుని తపస్సు చేశావు. చక్రవర్తి కావడానికి మార్గం తపస్సు కాదు. స్వయంకృషితో, శక్తిసామర్థ్యాలతో ఆ పదవిని



సాధించాలి. అలా సాధించినవాడిని తపస్సుతో జయించాలనుకోవడం, నువ్వు చేసిన తప్పు," అంటూ హెచ్చరించాడు భగవంతుడు.

"అయితే, నా తపస్సు వల్ల ప్రయోజనమేమిటి?" అన్నాడు మతంగుడు.

"అందువల్ల నీకు ఎన్నో అద్భుతశక్తులు లభించాయి," అన్నాడు భగవంతుడు.

"అయితే, ఆ అద్భుతశక్తులనుపయోగించి చక్రవర్తినౌతాను," అన్నాడు మతంగుడు.

"మనిషి తనకున్న శక్తులను తన అవసరానికి మాత్రమే ఉపయోగించుకోవాలి. అవసరానికి మించి ఆశపడితే ఏదో ఒకరోజున అంతకుపదింతలుచెల్లించవలసివుంటుంది. మనం ఎవరి నుంచయినా ప్రయోజనం పొందితే, అది మనం తిరిగి తీర్చగలిగి వుండాలి. అలా కానప్పుడు, పొందినదానికి పది రెట్లు పోగొట్టుకునే రోజు వస్తుంది. నా నుంచి వరాలు పొందిన ఋషులందరూ గొప్పవారయ్యారు. రాక్షసులు చెడ్డపేరు తెచ్చుకుని దారుణంగా చచ్చారు. తపస్సు స్వార్థానికి కాదు, దేవుణ్ణి చేరడానికి. ఈ విషయం మరిచిపోకు," అని భగవంతుడు హెచ్చరించాడు.

అప్పటికి మతంగుడి కళ్ళు తెరుచుకున్నాయి. ఆయన తనను భగవంతుడిలో ఐక్యం చేసుకోమని ప్రార్థించాడు.

"పుట్టిన ప్రతి మనిషివల్లా ఏదో ఒక ప్రయోజనం వుంటుంది. ఇంతవరకూ నువ్వు ఏ ప్రయోజనమూ సాధించలేదు. నీ మంచితనాన్ని ఋజువు చేసుకుని జీవిత ప్రయోజనం సాధించినరోజుననిన్నునాలోఐక్యంచేసుకుంటాను," అని మాయమయ్యాడు భగవంతుడు.

అప్పటినుంచీ మతంగుడు ఊరూరూ తిరుగుతూ మానవసేవ చేస్తున్నాడు.

ఈ కథ వినగానే సీతయ్యకు తానింతవరకూ చేసిన పొరపాట్లు తెలిసి వచ్చినై. తను బాదరాయణ మంత్రం ఉపయోగించి చాలా మంది నుంచి సాయం పొందుతున్నాడు. తన తండ్రి కూడా ఒకప్పుడిలాగే, ఆ మంత్రం వల్ల ప్రయోజనం పొంది వుంటాడు. అత్యాశకు పోయి ఆ మంత్రాన్ని అతిగా ఉపయోగించుకున్నాక — బదులు తీర్చవలసిన వంతు వచ్చేసరికి అశక్తుడయ్యాడు. క్రమంగా

అన్నీ పోగొట్టుకున్నాడు. అందుకే ఆయన పోయే ముందు, 'నా అత్యాశ వల్లే మనకీ గతి పట్టింది!' అన్నాడు. ఇప్పటికే తను ఇతరుల నుంచి చాలా ఎక్కువగా ప్రయోజనాలు పొంది వున్నాడు.

కొందరి నుంచి అవసరానికి మించిన సాయం తీసుకున్నాడు. కొన్నాళ్ళలో తనకూ తండ్రికి పట్టిన గతే పడుతుంది! అవసాన దశకు వచ్చేదాకా ఆమంత్రం గురించి తన బిడ్డలకు చెప్పడానికీ, హెచ్చరించడానికీ కూడా వీలులేదు!

ఇలా ఆలోచిస్తున్న సీతయ్యను, మతంగుడు పరీక్షగా చూస్తూ, "చూడు, నాయనా! నీలో ఏదో వశీకరణ శక్తి వుంది. నీవడిగిన సాయం చేసేవరకూ నేనిక్కణ్ణించి కదలలేను. కాబట్టి నీ కోరిక ఏదైనా వుంటే ఒక్కటి చెప్పు. తీర్చగలను," అన్నాడు.

సీతయ్య కొంతసేపు మధనపడి, "స్వామీ! తమరు చక్రవర్తి కావాలనుకుని తపస్సు ప్రారంభించారు. ఆ తపస్సు వల్ల సాధించిన అద్భుత శక్తులతో మానవాళికి మీరు చేస్తున్న సేవ, మీకిప్పుడు చక్రవర్తి అయ్యే అర్హతను సంపాదించి పెట్టింది. కానీ మీకు చక్రవర్తి కావాలన్న కోరిక లేదు," అన్నాడు.

"అవున్నాయనా," అన్నాడు మతంగుడు.

"స్వామీ! నాకు చక్రవర్తి కావాలన్నంత దురాశ లేదు. ఈ రాజ్యానికి రాజునయ్యేలా చేయండి, చాలు," అన్నాడు సీతయ్య.



"అయ్యో! భగవంతుడి హెచ్చరికను మరిచి పోయావా?" అన్నాడు మతంగుడు.

"లేదు స్వామీ! నేను రాజును పదవినుంచి తొలగించాలనుకోవడంలేదు.రాజుకు పుత్రులు లేరు. ఒక్కగానొక్క కుమార్తె వున్నది. ఆమెకు తగిన వరుడి కోసం ఆయన అన్వేషిస్తున్నాడు. ఆ వరుడికి తగ్గ అర్హతలన్నీ సంక్రమించి, స్వయంవరంలో నేనామెను గెల్చుకునేటట్లు వరమివ్వండి!" అన్నాడు సీతయ్య.

"తథాస్తు! నీ జీవితానికి ఒక సార్థకత కలిగింది. నీ కోర్కె తీర్చి నేను భగవత్ సాన్నిధ్యానికి చేరుకోగలను," అన్నాడు మతంగుడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, మతంగ ముని తాను తపస్సు ద్వారా సాధించిన

అద్భుత శక్తుల సాయంతో, సీతయ్యను ఒక దేశానికి రాజును చెయ్యడం అవివేకమూ, అనాలోచితమైన పనిగా నాకు తోస్తున్నది. సీతయ్య అప్పటికే తన బాదరాయణ మంత్రం ద్వారా, ఎందరినుంచో తను కోరినది సాధించు కుంటున్నాడు. అలాంటి వాడు ఒక దేశానికి రాజైతే, వాడి పరిపాలన ఎంత స్వార్థపూరితంగా, కిరాతకంగా వుంటుందో మనం ఊహించవచ్చు. ఇలాంటి స్వల్ప విషయాన్ని తపశ్శక్తి సంపన్నుడైన మతంగుడు ఎందువల్ల గ్రహించలేకపోయాడు? త్వరగా దైవసాన్నిధ్యాన్ని చేరాలన్న ప్రయత్నంలో ఆయన, దురాశాపూరితమైన మానవ నైజాన్ని విస్మరించాడా? సీతయ్య ఇంతకాలంగా పరాన్నభుక్కుగా బ్రతుకుతున్నాడని తెలిసీ, ఎంతో మహిమాన్వితుడైన మతంగుడు ఇంత పెద్ద తప్పిదం చేయడానికి కారణం ఏమిటి? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సీతయ్య స్వయంగా ఏ పనీపాటా లేకుండా, ఇతరుల నుంచి తన మంత్రం ద్వారా అవసరాలు తీర్చుకుంటున్నాడన్నది, మతంగుడికి తెలియంది కాదు. అలా చేయడం పాప కార్యమన్నసంగతి తెలిసేందుకే, మతంగుడు వాడికి తన కథ చెప్పాడు. అవసాన దశలో తండ్రి — నా అత్యాశవల్లే మనకీ గతి పట్టింది, అన్న మాటలూ, మతంగుడి స్వానుభవం, సీతయ్య మనస్తత్వంలో పెద్ద మార్పు తెచ్చినై. అప్పటి వరకూ ఇతరుల నుంచి తను పొందిన సాయానికి గాను, వాళ్ళకు తిరిగి సాయం చేయాలంటే, పుష్కలంగా ధనం కావాలి. అందుకు రాజ పదవి తప్ప మరొక మార్గం లేదు. అందుకే సీతయ్య దేశానికి రాజు కావాలనుకున్నాడు. మతంగుడు వాడి మనోగతాన్ని గుర్తించి, సరేనన్నాడు. ఈ కారణాల వల్ల, మతంగుడిది అపాత్రదానం అనుకోవడం సరికాదు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

[ఆధారం : "వసుంధర" రచన]



# మనదేశపు కోటలు - 5
# మధ్య భారతదేశంలోని కోటలు

రచన : మీరా ఉగ్రా ♦ చిత్రాలు : అరిత్రా



మాండూ

మధ్యప్రదేశ్ నైరుతి ప్రాంతంలో మాండూ కోట ఉన్నది. మొదట మండపదుర్గమని పిలువబడిన ఈ కోటను 12వ శతాబ్దంలో పార్మార్ రాజులు పునర్నిర్మించారు.

ఈ భాగాన్ని 1550వ సం॥ ప్రాంతంలో పాలించిన సుల్తాన్ బాజ్ బహాదూర్ గొప్ప సంగీత ప్రియుడు; శిల్పకళాభిమాని. సుప్రసిద్ధ గాయని రూపమతికోసం ఆయన నిర్మించిన భవనం చాలా సుందరమైనది. దాని సమీపంలో నర్మదానది ఎంతో అందంగా ప్రవహిస్తున్నది.



ఒకసారి జహాంగీరు చక్రవర్తి ఇక్కడ ఏడునెలల పాటు గడిపాడు. ఆయన తన రాణి నూర్జహాన్ కోసం 198 మెట్లతో ఒక సుందర భవనం నిర్మించాడు. నూర్జహాన్ ఒక్కొక్క మెట్టు ఎక్కుతున్నప్పుడు ఆమె పాదాల వద్ద మెట్టుకు రెండేసి బంగారు నాణాలు (అషర్ఫీలు) ఉంచారు.



క్రీ.శ. 525వ సం॥లో సూరజ్‌సేన్ గ్వలీపముని పేరు మీదుగా గ్వాలియర్ కోటను నిర్మించాడు. నిటారు కొండమీద చదునైన స్థలంలో నిర్మించబడిన ఈ కోట తోమార రాజుల కాలంలో (1388-1518) అత్యంత వైభవంగా వెలుగొందింది.

తోమారరాజులలో ప్రముఖుడైన మాన్‌సింగ్ సుప్రసిద్ధమైన మన్‌మందిర్‌ను నిర్మించాడు. నాలుగు అంతస్తులు గల ఈ భవనం రెండు అంతస్తులు భూమికి

మన్‌మందిర్: గ్వాలియర్

అడుగున నిర్మించబడ్డాయి. ఆయన ఆదరణలో సంగీతం, శిల్పకళ ఎంతగానో అభివృద్ధి చెందాయి. ప్రముఖ సంగీత విద్వాంసుడు మహమ్మద్ ఘౌస్, అతని సుప్రసిద్ధ శిష్యుడు తాన్‌సేన్ గ్వాలియర్‌లోనే నివసించారు. అక్కడ రూపొందిన సంగీత సంప్రదాయం గ్వాలియర్ ఘరానా సంగీతంగా ప్రసిద్ధిగాంచింది.




▲ తాన్‌సేన్ సమాధి



ఆదినాథ్ విగ్రహం

ఊర్వహి ద్వారం దగ్గరి బండరాళ్ళ మీద జైన తీర్థంకరుల బ్రహ్మాండమైన విగ్రహాలు చెక్కబడి ఉన్నాయి. ఆదినాథ్ విగ్రహం ఎత్తు 19 అడుగులు.

1857వ సం॥లో బ్రిటిష్ పాలకులకు వ్యతిరేకంగా చెలరేగిన పోరాటం సమయంలో గ్వాలియర్ సైనికులు తిరుగుబాటు జరిపి ఝాన్సీ లక్ష్మీబాయి, తాంతియా తోపేలతో కలిశారు. వారిద్దరూ 1858వ సం॥లో గ్వాలియర్ కోటను పట్టుకుని, బ్రిటిష్ పక్షం వహించిన సింధియా రాజును ఆగ్రాకు తరుమగొట్టారు. కాని ఆ తరవాత సర్ హగ్ రోజ్ సేనలతో వారిమీదికి వచ్చాడు. అప్పుడు జరిగిన యుద్ధంలో రాణి లక్ష్మీబాయి 1858 జూన్ 17వ తేదీ వీరమరణం పొందింది. ఆమె భౌతిక కాయాన్ని దహనం చేసిన స్థలంలో ఈనాడు కూడా సమాధి ఉన్నది.

మధ్య భారతదేశంలోని చునార్‌కోట, రోహతాస్ ఘడ్, కాలింజర్ కోటలు అజేయమైనవిగా, దుర్భేద్యమైనవిగా చరిత్ర ప్రసిద్ధి పొందాయి. అయితే షేర్‌ఖాన్ (షేర్ షా సూర్) ఈమూడింటినీ మూడు భిన్న మార్గాలలో వశపరచుకున్నాడు.







తూర్పు ఉత్తర ప్రదేశ్‌లోని వింధ్య పర్వతం నిటారుకొండశిఖరం మీద చునార్ కోట నిర్మించ బడింది. కొండ ఒకవైపు గంగా నదిలోకి చొచ్చుకునిపోయి ఉన్నది. అందువల్ల ఆవైపు నుంచి శత్రువులు దాడి జరపడం అసాధ్యం. 1531వ సం॥లో సుబేదార్ తాజ్ ఖాన్ వితంతువయిన బేగమ్‌లాడ్ మాలికాను వివాహమాడడంతో షేర్ ఖాన్, చునార్ కోటను పొందగలిగాడు.

చునార్ కోట

షేర్‌ఖాన్ వశంలో ఉన్న చునార్ కోటను 1538వ సం॥లో హుమయూన్ పట్టుకోవడంతో షేర్‌ఖాన్ స్థావరం కోసం అన్వేషించసాగాడు. అతడు అందుకొక పథకం ఆలోచించి, తన కుటుంబానికి రోహతాస్ ఘడ్‌లో ఆశ్రయంకావాలని వేడుకున్నాడు. రాజపుత్ర రాజు అందుకు అంగీకరించాడు. 700 మేనాలను కోట లోపలికి మోసుకు వెళ్ళారు. కోట రక్షక భటులు మొదటి 50 మేనాలను పరిశోధించారు. వారిలో అందరూ వృద్ధస్త్రీలే ఉండడంతో, మిగతా మేనాలను పరిశోధించకుండా లోపలికి అనుమతించారు. అంతే! కొంతసేపటికి మేనాల నుంచి, ఆయుధపాణులయిన అఫ్ఘన్ సైనికులు వెలుపలికి ఉరికారు. ఆశ్రయం ఇవ్వచూసిన రాజునే కోటనుంచి తరుమగొట్టారు. అవిధంగా కైమూర్ కొండల మీద దుర్భేద్యమైన రోహతాస్ ఘడ్‌ను వశపరచుకున్నాడు షేర్‌ఖాన్!

చునార్, రోహతాస్ ఘడ్ ఉదంతాలు - చంద్రకాంత, భూతనాథ్, కుసుమకుమారి మొదలైన సాహసగాథలు రచించడానికి దేవకీనందన్ ఖాత్రికి స్ఫూర్తినిచ్చాయి.

రోహతాస్ ఘడ్



వింధ్య పర్వతాల మీది కలింజర్ కోట మన దేశంలోని అతి పురాతనమైన కోటలలో ఒకటి. గ్రీకు చరిత్రకారుడు టోల్మీ దీనిని కాంగోర్ అని పేర్కొన్నాడు.

1545వ సం॥లో షేర్ షా సూర్ సేనలు ఈ కోట మీదికి ముట్టడి జరిపినప్పుడు కీర్తిసింగ్ చందేలా దీనిని పరిపాలిస్తున్నాడు. ఒక సంవత్సరం పాటు ముట్టడి సాగినా కోటను పట్టుకోలేక పోయేసరికి, ముట్టడిని పర్యవేక్షించడానికి షేర్‌షా స్వయంగా అక్కడికి వచ్చాడు.

కలింజర్ కోట

1545వ సం॥ మే 21వ తేదీ ఆఫ్ఘన్ సేనలు పేల్చిన ఒక ఫిరంగి గుండు, కోట తలుపుకు తగిలి తిరిగి వచ్చి వెలుపల మైదానంలో పేర్చబడి ఉన్న మందుగుళ్ళ మీద పడింది. దాని తాకిడికి ఆ మందుగుళ్ళు నిప్పు అంటుకోవడంతో ఏర్పడిన ప్రమాదంలో షేర్‌ఖాన్ తీవ్రంగా గాయపడ్డాడు. దానిని చూసి ప్రతీకారంతో రెచ్చిపోయిన సైనికులు వీరావేశంతో గోడలు బద్దలు కొట్టి, కోటను పట్టేశారు. కీర్తిసింగ్‌ను బంధించి, చంపేశారు. కాని ఆనరికే గాయపడిన షేర్‌ఖాన్ కూడా మరణించడంతో వాళ్ళు సాధించిన విజయం నిరుపయోగమయింది!

ప్రయాగ సమీపంలో గంగా యమునల సంగమం వద్ద ఉన్న అలహాబాదు కోటను మొగలు చక్రవర్తి అక్బర్ నిర్మించాడు. 1583వ సం॥లో 300 పడవలతో అక్కడికి చేరిన అక్బర్ చక్రవర్తి నవంబరు 4వ తేదీ ఇల్లహాబాస్ (ఇల్లాహ్+అబాస్) 'దైవ నిలయం' అనే నగరానికి శంకుస్థాపన చేశాడు. మరీ పల్లంలో ప్రవహిస్తున్న యమున, వేగంగా సాగే గంగానదీప్రవాహం కోట నిర్మాణాన్ని కష్టతరం చేశాయి. ఆ కోట నిర్మాణానికి పదేళ్ళకు పైగా పట్టింది. ఆరుకోట్ల రూపాయలకు పైగా ఖర్చయింది.

1380 నుంచి నిర్లక్ష్యానికి గురైన కౌశాంబి అశోక స్థూపాన్ని తీసుకువచ్చి, బ్రిటిష్ వాళ్ళు 1838వ సం॥లో ఈ కోట లోపల ప్రతిష్ఠించారు.

అలహాబాద్ కోట





# రాజసన్మానం

ఒక ఊళ్ళో భాస్కరుడనే కవి వున్నాడు. అతడికి రాజసన్మానం పొందాలని కోరిక. అందుకోసం ఆ దేశపురాజు చంద్రభానుణ్ణి పొగుడుతూ పెద్ద కావ్యం రాశాడు. ఆకావ్యాన్ని వినిపించడం ఎలాగో తెలియక గ్రామాధికారి వద్దకువెళ్ళి సాయమడిగాడు.

"నేను రాజధానికి వెళితే కలుసుకునేది రాజోద్యోగులనే. మంత్రిగారి దర్శనమే ఇంత వరకూ కాలేదు. రాజదర్శనం విషయంలో నీకు నేనేమి సాయపడగలను? రాజధానిలో ఆస్థానకవుల నెవరినైనా ఆశ్రయించు," అన్నాడు గ్రామాధికారి.

భాస్కరుడు తన కావ్యం తీసుకుని వెంటనే రాజధానికి బయల్దేరాడు. అందుకు అడవి మార్గం అయితే దగ్గర. ఆ మార్గం వెంట కొంతదూరం వెళ్ళే సరికి, దొంగ ఒకడు అతణ్ణి అడ్డగించి ఉన్నదంతా ఇవ్వమన్నాడు.

"ఇప్పుడు నా దగ్గర ఏమీ లేదు. నా కావ్యాన్ని రాజు విని మెచ్చి డబ్బిస్తే, అందులో నీకు కొంత వాటా ఇవ్వగలను," అని భాస్కరుడు దొంగను వేడుకున్నాడు.

దొంగ ఆశ్చర్యపోతూ, "నువ్వు కవివా! అయితే నా గురువును చూడాల్సిందే. ఆయనకుకవులంటే మహాయిష్టం, పద!" అంటూ భాస్కరుడి కళ్ళకు గంతలు కట్టి కొంత దూరం మెల్లగానడిపించి తీసుకువెళ్ళి కట్లు విప్పాడు.

కొండల మధ్య పెద్ద భవనంలో తానున్నట్లు గ్రహించాడు, భాస్కరుడు. అక్కడ చాలా మంది దొంగలు, నేరస్థులు, కసాయివాళ్ళు రకరకాల పనులు చేస్తూ తిరుగుతున్నారు. వాళ్ళ గురువు తెల్లని పట్టు వస్త్రాలు ధరించి తేజస్సుతో మిలమిల మెరిసిపోతున్నాడు. దొంగ, భాస్కరుడుని గురించి అయనకు చెప్పాడు.

జొన్నలగడ్డ రామలక్ష్మి



గురువు, భాస్కరుడితో, "నాపేరు విద్యా నాథుడు. నాకు కవిత్వమంటే ఎంతో ఇష్టం. కవిత్వం రాయడానికి, ఈ అడవి ఎంతో బాగుంటుంది. ఇక్కడ ప్రకృతి ఆత్మబంధువులా పలకరిస్తుంది. ఇలాంటి సహజ వాతావరణంలో కవికి కవిత్వం తృప్తి నిస్తుంది. నువ్వు కూడా నాతోపాటు ఇక్కడే వుండిపో," అన్నాడు.

"నాకు రాజసన్మానం పొందాలని వుంది," అన్నాడు భాస్కరుడు.

"రాజసన్మానమా? కవులకలాంటి కోరిక తగదు. రాజులు కవులచేత నీచమైన పనులు చేయిస్తారు," అన్నాడు విద్యానాథుడు గంభీరంగా.

"తమరు నేరస్థుల మధ్య వుంటూ రాజ నీచత్వం గురించి ఆలోచించడం హాస్యాస్పదంగా వుంది!" అన్నాడు భాస్కరుడు.

"నా చుట్టూ వున్నవారి గురించి నీకు సరిగ్గా తెలిసినట్టు లేదు. త్వరలో నీ అభిప్రాయంమారుతుంది," అన్నాడు విద్యానాథుడు.

ఆరోజు చీకటిపడ్డాక విద్యానాథుడు, అక్కడ వున్న వారందరికీ భాగవతంలోని పద్యాలు చదివి వినిపించాడు. అర్థం వివరించాడు. ఎవరైనా సందేహాలు వెల్లడిస్తే తీర్చాడు.

భాస్కరుడిదంతా చూశాడు. అక్కడున్న వారిలో అతడికేప్రత్యేకతా కనిపించలేదు. ద్రుమము లేని చోట ఆముదపు మొక్క మహావృక్షమన్నట్లు, విద్యానాథుడు వారి మధ్యన మాత్రమే రాణించగలడేమో! అందుకే ఆయన కక్కడ బాగుందని అతడనుకున్నాడు.

ఆరాత్రి సుఖంగా నిద్రపోయాక, మర్నాడు లేస్తూనే భాస్కరుడు ప్రయాణమయ్యాడు. విద్యానాథుడు అతడి వంక జాలిగాచూసి, "ఇలాంటి శ్రోతలు నీకు దొరకరు. ఇక్కడ నీకురోజులు సుఖంగా వెళ్ళిపోతాయి. రాజుల వద్దకు వెళ్ళి ఏమి బావుకుంటావు?" అన్నాడు.

ఏమైనా భాస్కరుడు మాత్రం అక్కడుండదల్చుకోలేదు. అప్పుడు విద్యానాథుడు, "ఈ అడవి దాటాక నాదపురం వస్తుంది. అక్కడ నా శిష్యుడు వల్లభుడుంటున్నాడు. వాడు మహాకవి. నువ్వు వాణ్ణి కలుసుకో; కర్తవ్యం బోధపడుతుంది," అన్నాడు.

సరేనని బయల్దేరి భాస్కరుడు నాదపురం చేరుకున్నాడు. అక్కడ వల్లభుడి గురించి ఎంతమందిని అడిగినా ఆచూకీ తెలియలేదు. ఆఖరి ప్రయత్నంగా అతడొక పశులకాపరిని, వల్లభుడి గురించి అడిగాడు.

"నేనే వల్లభుణ్ణి. నాతో నీకేం పని?" అన్నాడా పశువులకాపరి.

"నువ్వు వల్లభుడివా? నీ గురువు విద్యా నాథుడు, నువ్వు మహాకవివని చెప్పాడే?" అన్నాడు భాస్కరుడు ఆశ్చర్యంగా.

"నిన్ను విద్యానాథుడు పంపాడా? ఆయన ఎలా వున్నాడు? మళ్ళీ కొత్తగా కావ్యాలేమైనా రాశాడా?" అంటూ వల్లభుడు, భాస్కరుణ్ణి ప్రశ్నలతో ముంచెత్తాడు.

"విద్యానాథుడు కవిత్వం రాస్తాడో లేదో నాకు తెలియదు. ఆయన పామరులకు పురాణ కవుల కావ్యాలు వినిపిస్తూ రోజులు వెళ్ళబుచ్చుతున్నాడు. సరే, నువ్వు విద్యా నాథుడి శిష్యరికం ఎందుకు చేశావు? ఎప్పుడు చేశావు? ఏం సాధించావు?" అంటూ భాస్క రుడు, వల్లభుణ్ణి ప్రశ్నించాడు.

అప్పుడు వల్లభుడు తనను గురించి చెప్పుకున్నాడు. వాడొక పేదరైతు ఇంట పుట్టాడు. వాడికి చిన్నప్పటి నుంచీ కవిత్వ మంటే ఇష్టం. తనకు తోచిన విధంగా కవిత్వమల్లి పాడుకుంటూ పక్షులకూ, జంతువులకూ వినిపిస్తూండేవాడు. ఒకసారి విద్యానాథుడా ఊరు వచ్చాడు. ఆనాటి రాత్రి



దేవాలయప్రాంగణంలో చేరిన వారికి, తిక్కన వ్రాసిన మహాభారతంలోని పద్యాలు విని పించి, చక్కగా అర్థం చెప్పి సందేహాలడిగిన వారికి తీర్చాడు. వల్లభుడు ముగ్ధుడై ఆయన వద్దకు వెళ్ళి, "అయ్యా! అందాన్నీ, మంచి తనాన్నీ చూసినప్పుడల్లా నాలో కవిత్వం పొంగుకొస్తుంది. పద్యాలల్లి పాడుతాను. నా పద్యాల అర్థం నాకే తెలియదు. తమరు విని అవి మంచి పద్యాలో, పిచ్చిమాటలో చెప్పాలి," అంటూ తన పద్యాలు కొన్ని విని పించాడు.

విద్యానాథుడవి విని, "నాయనా! నువ్వు సహజకవివి. నా వెంటరా! ఏడాదిలో నిన్ను మహాకవిని చేస్తాను," అన్నాడు.



వల్లభుడాయనతో వెళ్ళాడు. అతడికి భాష గురించి తెలిసింది. అప్పుడతడొక కావ్యం రాశాడు. విద్యానాథుడాకావ్యాన్ని ఎంతగానో మెచ్చుకుని, "నువ్వు కలకాలం ఇలాగే కవిత్వం చెప్పాలనుకుంటే రాజాశ్రయానికి వెళ్ళకు," అని సలహా ఇచ్చాడు.

వల్లభుడు పేదవాడు. గురు శుశ్రూష అయ్యాక ఇంటికి వచ్చేసరికి తండ్రి జబ్బు పడ్డాడు. ఇంటి భారమంతా అతడి మీద పడింది. దానితో ఇక కవిత్వం రాసే తీరుబాటుండదేమో అని భయపడి రాజధానికి వెళ్ళాడు. కానీ అక్కడి రాజాస్థాన పరిస్థితులు నచ్చక తిరిగి వచ్చాడు. ఆసమయంలో, అదే ఊరిలోవున్న రత్నాకరుడనే భాగ్యవంతుడు కబురు పెట్టి, "నువ్వు నాకు ఇల్లరికపు టల్లుడుగా వుంటానంటే, నీ తల్లి దండ్రులకు బ్రతికున్నంత కాలం సేవకులను నియమిస్తాను. నువ్వు ఏ బాదరబందీ లేకుండా కవిత్వం రాసుకోవచ్చు," అన్నాడు.

వల్లభుడందుకు ఒప్పుకుని రత్నాకరుడి కూతురు మంజరిని పెళ్ళి చేసుకున్నాడు. మంజరి పెంకెపిల్ల. భర్త చేత అడ్డమైన పనులూ చేయిస్తుంది. తిక్కరేగితే పశువుల్ని కాసే పనికూడా పంపుతుంది.

"అయ్యో పాపం! నీది చాలా బాధాకరమైన జీవితం," అంటూ భాస్కరుడు అతడిమీద జాలి పడ్డాడు.

"నాకేమీ బాధగా లేదు. రోజూ కవిత్వం రాసుకునేందుకు తగినంత సమయముంటున్నది. అంతకంటే నాకేం కావాలి?" అన్నాడు వల్లభుడు.

భాస్కరుడికీ మాటలు నచ్చలేదు. వల్లభుడి కవిత్వంలో పసలేదనీ, అందువల్లనే రాజు వాడికాశ్రయమిచ్చి వుండడనీ అనుకుని, రాజధానికి ప్రయాణమయ్యాడు.

అప్పుడు వల్లభుడు, "రాజధానిలో వేదాచారి అనే గొప్పకవి వున్నాడు. నీవాయనను కలుసుకుంటే తగిన సాయం చేస్తాడు," అని చెప్పాడు.

భాస్కరుడు ప్రయాణమై రాజధానికి వెళ్ళాడు. అక్కడ విచారించగా – వేదాచారి అనే ఆయన ఊరి చివర ఆశ్రమంలో

రోగులకు సేవ చేస్తుంటాడని చెప్పారు. కవి అయినవాడు ఆశ్రమంలో రోగులకు సేవ చేస్తూ కాలం గడపడమేమిటి, అనుకుంటూ భాస్కరుడు ఆశ్రమానికి వెళ్ళి వేదాచారిని కలుసుకున్నాడు.

వేదాచారి, భాస్కరుడి వివరాలన్నీ తెలుసుకుని, "నాయనా! కవికి రాజాశ్రయం వల్ల గుర్తింపు సులభమవుతుంది. కానీ రాజుల సేవ నరక ప్రాయం. అది తెలుసుకునే విద్యానాథుడు అడవులకు పోయాడు. వల్లభుడు, రత్నాకరుడి అల్లుడయ్యాడు. నేను రోగులకు సేవ చేస్తున్నాను," అని ఒక క్షణం ఆగి, "ఇదంతా అలా వుంచుదాం. ఏదీ నీకావ్యం?" అన్నాడు.

భాస్కరుడు, వేదాచారికి తన కావ్యం ఇచ్చాడు. ఆయన కావ్యంలోని కొన్ని పుటలు చదివి, "నాయనా! ఇప్పుడు నీగురించి నాకే సందేహమూ లేదు. తమ ఆశ్రయం కోరే కవుల చేత రాజులు చేయించే దాస్యవృత్తి నువ్వు ముందే ప్రారంభించావు. నీకు తప్పక రాజాశ్రయం లభిస్తుంది!" అన్నాడు.

ఆమాటలతో భాస్కరుడి ముఖం ఎర్రబడింది. "ఏమిటి నేనుచేసిన దాస్యవృత్తి?" అని అడిగాడు ఉక్రోషంగా.

"ఈ కావ్యంలోరాజు చంద్రభానుడి గురించిన ప్రశంసలే కనబడుతున్నాయి. వీటిలో ఏ ప్రశంసకూ ఆయన అర్హుడుకాడు. అర్హత లేకుండా ప్రశంసలు పొందాలన్న తమ కోర్కెను రాజులు, కవుల ద్వారా తీర్చుకుంటారు. ఆ కోరిక నీచమైనది. అడిగేవాడూ, తీర్చేవాడూ కూడా నీచుడే," అన్నాడు వేదాచారి తడుముకోకుండా.

అప్పటికి భాస్కరుడికి విషయం అర్థమయింది. అతడు కొంతకాలం రాజధానిలోనే వుండి, అక్కడి గ్రంథాలయాల్లో విద్యానాథుడు, వల్లభుడు, వేదాచారి వంటి వారి కావ్యాలు చదువుతూ గడిపాడు.

ఆ తర్వాత రాజదర్శనం కోసం ప్రత్నించకుండానే, తనఊరికి తిరిగి వెళ్ళాడు. అక్కడ ప్రశాంతంగా జీవితం గడుపుతూ కొన్ని కావ్యాలు రచించాడు కానీ, రాజసన్మానం గురించి మాత్రం ప్రయత్నించలేదు.





# శరభయ్య వైరాగ్యం

శరభయ్య అనే ఒక గృహస్థు సంసారం మీద విరక్తి చెంది, వృద్ధురాలైన తల్లినీ, భార్యా బిడ్డల్నీ వదిలి దేశాటనం చేస్తూ, మంగళాపురం అనే ఊరును చేరుకున్నాడు. ఆ ఊరిలో పచ్చనితోటలూ, గలగల పారే సెలయేరూ, చుట్టూ వున్న చిన్నా పెద్ద కొండలూ అతని మనస్సును ఎంతగానో ఆకట్టుకున్నాయి. ఊరి వెలుపల సెలయేటి ఒడ్డున కొత్తగా వెలసిన విద్యానందాశ్రమం గురించి విని, శరభయ్య అక్కడికి వెళ్ళి స్వాములవారి దర్శనం చేసుకున్నాడు.

"చెప్పు, నాయనా! నీకేం కావాలి?" అని ఎంతో ఆప్యాయంగా అడిగాడు విద్యానంద స్వామి.

"నన్ను మీ శిష్యుడుగా స్వీకరించండి, స్వామీ. మీ సేవ చేసుకుంటూ ఇక్కడే వుండిపోతాను," అన్నాడు శరభయ్య చేతులు కట్టుకుని.

స్వామి, శరభయ్య కేసి పరీక్షగా చూసి, "విద్య నేర్చుకోవాలని నా దగ్గరకొచ్చే బ్రహ్మచారులను మాత్రమే, శిష్యులుగా చేర్చుకుంటాను. కాని, నువ్వు అలా కనిపించడం లేదు," అన్నాడు.

అందుకు శరభయ్య, "స్వామీ! సర్వజ్ఞులైన మీ దగ్గర నిజం దాచగలనా. మీరు ఊహించినట్టు నేను బ్రహ్మచారిని కాదు. నాకు భార్యా, ముగ్గురు పిల్లలూ, ముసలితల్లీ ఉన్నారు. నా భార్య పరమగయ్యాళి. ఆమెకూ, నా తల్లికీ ఒక్క క్షణం పడదు. అత్తాకోడళ్ళ తగవుల మధ్య నేను నలిగిపోతున్నాను. విడవమంటే పాముకు కోపం, కరవమంటే కప్పకు కోపం —అన్నట్టుగా తయారైంది నాపరిస్థితి. ఆ ఇంట్లో నాకు మనశ్శాంతి కరువైంది. అందువల్లనే సంసారాన్ని వదిలి సుఖ శాంతులు వెతుక్కుంటూ, మీ దగ్గరకు చేరుకున్నాను. కరుణించి నన్ను శిష్యుడిగా స్వీకరించి, నాకు

జి.సి. జీవి

మనశ్శాంతిని ప్రసాదించండి," అని వేడుకున్నాడు.

సంసారులకు తన ఆశ్రమంలో స్థానం లేదన్నాడు, విద్యానందస్వామి. అయినా శరభయ్య వినక, స్వామిని కాళ్ళావేళ్ళాపడి బ్రతిమాలసాగాడు.

చివరకు స్వామి, "సరే, ప్రస్తుతానికి ఇక్కడ వుండడానికి అనుమతిస్తున్నాను. తర్వాత నిదానంగా ఆలోచించి నా నిర్ణయమేదో చెబుతాను," అన్నాడు.

ఒక వారం గడిచేసరికి, ఆశ్రమజీవితం విసుగనిపించింది, శరభయ్యకు. ఆశ్రమపు కఠిన నియమాలను పాటించడం, వాళ్ళుపెట్టే సాత్వికాహారాన్ని తినడం అతడికి కష్టమనిపించింది. తను ఈ మధ్యకాలంలో గడిపిన దేశదిమ్మరి జీవితమే చాలా సుఖమనిపించిందతడికి.

ఒకనాటి రాత్రి వసారాలో పడుకుని నిద్రపోతున్న శరభయ్యను, తట్టిలేపాడు స్వామి.

శరభయ్యగాభరపడిపోతూ, "ఏం, స్వామీ! ఏం జరిగింది?" అని అడిగాడు.

"మరేం లేదు, శరభయ్యా! ఎందుకనో ఇంతకు కొద్దిసేపుముందు జపం చేయాలనిపించింది. అయితే, ఎంత వెదికినా జపమాల కనిపించలేదు. ఇద్దరం కలిసి వెతుకుదాం పద," అంటూ స్వామి, శరభయ్యను ఆశ్రమం బయటికి తీసుకు వచ్చాడు.

"స్వామీ! రాత్రి పడుకోబోయేముందు జపమాల ఎక్కడ పెట్టారో గుర్తుందా?" అని అడిగాడు శరభయ్య.



"గదిలో ఒక మూలగా వున్న ముక్కాలి పీట మీద పెట్టినట్టు గుర్తు, శరభయ్యా! కాని లోపల అంతా చీకటిగా ఉన్నదికదా! ఇక్కడ ఆవరణలో బాగా వెన్నెల కాస్తున్నది," అన్నాడు స్వామి.

ఇది విని శరభయ్య వచ్చే నవ్వును ఆపుకుంటూ, "అదేమిటి, స్వామీ? ఎక్కడ పారేసుకున్న వస్తువును అక్కడే వెతుక్కోవాలి గానీ, ఇక్కడ గది బయట వెతికితే దొరుకుతుందా?" అన్నాడు.

ఈ జవాబుకు విద్యానందస్వామి చిన్నగా నవ్వి, "బాగా చెప్పావు, శరభయ్యా! కాని, నువ్వు చేసిన పనేమిటి? సంసారంలో పోగొట్టుకున్న సుఖశాంతులు, ఇంకెక్కడో దొరుకుతాయని ఊరూరా తిరుగుతూ ఇంతదూరం వచ్చావు కదా. అటువంటప్పుడు గదిలోపల పోయిన జపమాల, గది బయట వెతికితే కనిపించదా?" అన్నాడు.

వెంటనే ఆయన మాటల్లో అంతరార్థం బోధపడింది, శరభయ్యకు. అతడు వెంటనే భక్తితో స్వామి కాళ్ళుతాకి, "నా కళ్ళు తెరిపించారు, స్వామీ! నేనిప్పుడే మా ఊరుకు బయలుదేరుతాను. నా సంసారాన్ని చక్కదిద్దుకుని ఉన్నంతలో సంతోషంగా కాలం గడుపుతాను," అన్నాడు.

విద్యానందస్వామి మందహాసం చేస్తూ శరభయ్యను చేయెత్తి దీవించి, "అంత తొందరెందుకు? ఈ రాత్రికి హాయిగా నిద్రపోయి, తెల్లవారాక భార్యను కూడా వెంటబెట్టుకు వెళ్ళు," అన్నాడు.

జరిగిందేమంటే—శరభయ్య భార్య, ఒక దూరపు చుట్టం ద్వారా తన భర్త విద్యానంద స్వామిఆశ్రమంలో వున్నాడని విని, అతణ్ణి వెతుక్కుంటూ ఆరోజు రాత్రే ఆశ్రమానికి వచ్చింది. ఆమెవిద్యానందస్వామి కాళ్ళ మీద పడి, ఇకనుంచీ ఏ రచ్చలూ లేకుండా అత్తాకోడళ్ళం సఖ్యంగావుంటామనీ,ఎలాగైనా తన భర్త మనసును మార్చి ఇంటికి వచ్చేలా చేయమనీ వేడుకున్నది.

తెల్లవారగానే స్వామి దగ్గర సెలవు తీసుకుని, సంతోషంగా సొంతఊరుకు బయలుదేరారు, శరభయ్య దంపతులు.






సంతానాపేక్షతో ముని ఆశ్రమాల చుట్టూ తిరిగిన ద్రుపదుడు ఒక కొడుకునూ, ఒక కూతురినీ కోరాడు. కొడుకెందుకంటే, ద్రోణుణ్ణి చంపటానికి; కూతురు అర్జునుడికి భార్య కాగలందులకు. ఈ కోరికతో ఆయన వివిధ ఆశ్రమాలు తిరుగుతూ గంగా యమునా సంగమం వద్ద గల ఒక ఆశ్రమాన్ని చేరాడు. అక్కడ యాజుడూ, ఉపయాజుడూ అనే ఇద్దరు అన్నదమ్ములు, కాశ్యపగోత్రం వాళ్ళు రోజల్లా వేదపారాయణం చేస్తూ, సూర్యారాధన జరుపుతూ ఉంటున్నారు. వారిలో తమ్ముడైన ఉపయాజుడే ఎక్కువ తపోబల సంపన్నుడుగా ద్రుపదుడికి కనిపించాడు. అందుచేత ద్రుపదుడు ఆయన దగ్గిర చేరి ఎంతో భక్తిశ్రద్ధలతో సేవలు చేయసాగాడు.

ఒకనాడు ద్రుపదుడు ఏకాంతంలో ఉపయాజుడికి కాళ్ళు పట్టుతూ, "మునీశ్వరా, ద్రోణుడు నాకు తీరని అవమానం చేశాడు. నేనుగాని, మరోరాజుగాని ఆయనను చంపే శక్తి గలవాళ్ళం కాము. ఆ ద్రోణాచార్యుణ్ణి చంపగల కుమారుడు నాకు కలిగేటట్టుగా తమరుఅనుగ్రహించే పక్షంలో తమకు అసంఖ్యాకంగా గోవులనూ, తాము కోరే విలువయిన ఇతర వస్తువులనూ కావలసినన్ని ఇవ్వగలను," అన్నాడు.

దానికి ఉపయాజుడు తల అడ్డంగా ఊపి, "నా కిలాటి కోరికలేమీలేవు. అదీగాక నేను ఇటువంటి పనులకుఎవరికీ సహాయం చెయ్యను," అని ఆ ప్రసంగం అంతటితో కట్టిపెట్టేశాడు.

## 13. ద్రుపదుడి సంతానం



అయినా ద్రుపదుడు నిరాశచెందక ఉప యాజుణ్ణి మరింత శ్రద్ధగా సేవించసాగాడు. ఒక ఏడాది గడిచింది. ఒకనాడు ఉపయాజుడు ద్రుపదుడితో, "రాజా, నాకు అంతులేని సేవలు చేస్తున్నావు. కాని నీ కోరిక అనుచితమైనది. అందుచేత అదినెరవేరటానికి నేను ఎన్నటికీసహాయపడను.అయినాఒకఉపాయం చెబుతాను.నువ్వు నా అన్న అయిన యాజుణ్ణి ఆశ్రయించు. అతన్ని నీ సేవలతో మెప్పించు. అంతులేని గోవులను ఇస్తానని ఆశపెట్టు. అతను నీకోరిక తీర్చవచ్చు. అతను మొదటి నుంచీ కొంచెం ఆశాపరుడు. ఒకసారి అశుభ్రమైనచోట రాలిన పండు తిన్నాడు. మేము గురుకులవాసంచేసేటప్పుడు కూడా శుచీ, అశుచీ అన్న విచక్షణ లేకుండా జిహ్వకు రుచి అయినదెల్లా తినేవాడు," అన్నాడు.

ఉపయాజుడీ మాట చెప్పగానే ద్రుపదుడు యాజుడి ఆశ్రమానికి వెళ్ళి, ఆయనకు నమస్కారం చేసి, ఎనభైవేల గోవులను కానుకగా సమర్పించి తన కోరికను తెలుపుకున్నాడు.

యాజుడిందుకు సమ్మతించాడు. ఆయన ఉపయాజుణ్ణి తనకు సహాయం ఉంచుకుని, అవసరమైన సంభారాలన్నీ సేకరించి, పుత్రకామేష్టి ప్రారంభించాడు. ఆయన హోమం చేసి అనంతరం హవిస్సు చేతిలోకి తీసుకుని, ద్రుపదుడి భార్య అయిన కోకిలాదేవిని దగ్గరికి పిలిచి, "ఈ హవిస్సు పుచ్చుకో. నీ గర్భాన ఒక కొడుకూ, కూతురూ జన్మిస్తారు," అన్నాడు.

అప్పుడు కోకిలాదేవి, "అయ్యా, అశుచిగా ఉన్నాను. కొంచెం ఆగండి, స్నానం చేసి వస్తాను," అన్నది.

"నేనూ, నాతమ్ముడూ కలిసిదీక్షతో తయారుచేసిన హవిస్సు నీ కోరిక తీర్చకపోతుందా? వస్తే రా, లేకపోతే మానెయ్యి," అంటూ యాజుడు కోపంగా హవిస్సును అగ్నిలో పడవేశాడు.

ఆ అగ్నికుండంలోనుంచి ఒక యోధుడు ఒక చేత మెరుస్తున్న కత్తి, ఒక చేత విల్లూ ధరించి, నెత్తిన మణిమయమైన కిరీటంతో సహా, రథారూఢుడై వెలువడి, దిక్కులు పిక్క

టిల్లేలాగా సింహనాదం చేశాడు. తరవాత ఆ అగ్నికుండం నుంచే తేజస్విని అయిన ఒక స్త్రీ పుట్టింది. ఈ విధంగా ద్రుపదుడు ఒక కొడుకునూ, కూతురినీ పొందినవా డయ్యాడు.

పాంచాలులందరూ పరమానంద భరితుల య్యారు.

ఇంతలో కోకిలాదేవి స్నానం చేసి వచ్చి, అగ్నికుండంలో పుట్టిన బిడ్డలిద్దరికీ తాను తల్లి అయేటట్టుగా యాజుడి వద్దా, ఉప యాజుడి వద్దా వరం పొందింది.

బ్రాహ్మణులు ద్రుపదుడి కొడుకుకు ధృష్ట ద్యుమ్నుడు అనీ, కుమార్తె నల్లనిది కావడం చేత కృష్ణ అనీ పేర్లు పెట్టారు. ద్రుపదుడు యాజుడికి అంతులేని గోవులనూ, బ్రాహ్మణు లకు అంతులేని ధనాన్నీ ఇచ్చి, కాంపిల్యనగ రానికి తిరిగి వచ్చాడు.

కొంత కాలమయ్యాక ద్రుపదుడు ధృష్టద్యు మ్నుణ్ణి ద్రోణుడి వద్ద అస్త్ర విద్యాభ్యాసం కోసం పంపాడు. విద్య నేర్పనంటే తనకు అపకీర్తి వస్తుందని ద్రోణుడు ఆ కుర్రవాడికి విలువిద్యలన్నీ నేర్పాడు.

ద్రుపదుడి కూతురు ద్రౌపది వివాహ యోగ్యురాలయింది. ఆమెను అర్జునుడికిచ్చి చేద్దామని మొదటి నుంచీ ద్రుపదుడి ఉద్దేశం. అయితే పాండవులు లక్క ఇంట కాలిపోయా రని వార్త తెలిసింది. ద్రుపదుడు హతాశుడై తన బంధు మిత్ర మంత్రి పురోహితులను సమావేశపరిచి కర్తవ్యం గురించి వారి సలహా అడిగాడు.





అప్పుడు ద్రుపదుడికి ఆప్తుడైన పురోహితుడొకడు, "మహారాజా, పాండవులకు అపాయం జరిగిందని తోచదు. అనేక శకునాలను బట్టి సుఖంగానే ఉన్నట్టు కనబడుతున్నది. అయినా అదంతా నీ కెందుకు? నువ్వు స్వయంవరం ప్రకటించు, వారు తప్పక వస్తారు. రాజకన్యలకు స్వయంవరం పరిపాటే కదా!" అన్నాడు.

మూడున్నర మాసాల తరవాత స్వయంవరానికి ముహూర్తం ఏర్పాటయింది. ఎక్కుపెట్టటానికి ఒకంతట సాధ్యంకాని విల్లు ఒకటి సిద్ధం చేయబడింది. ఒకచోట, ఆకాశాన తిరిగే బంగారు మత్స్యయంత్రం అమర్చబడింది.

ఏకచక్రపురంలో కుంతీ పాండవులుంటున్న బ్రాహ్మణుడి ఇంటికి అతిథిగా వచ్చిన బ్రాహ్మణుడీ వివరాలన్నీ చెప్పి, "ఎక్కడెక్కడి రాజులూ ద్రౌపదీ స్వయంవరానికై కాంపిల్య నగరానికి తరలిపోతున్నారు," అని ముగించాడు.

తమ గురువైన ద్రోణాచార్యుణ్ణి చంపేవాడొకడు పుట్టాడని విని పాండవులు విచారించారు, కాని కానున్నది అయేతీరుతుందనుకుని సమాధానపడ్డారు. వారికి కూడా ద్రౌపదీ స్వయంవరానికి వెళ్ళాలని ఉన్నది.

ఈసంగతిగ్రహించికుంతీదేవిధర్మరాజుతో, "నాయనా, మనం చాలాకాలంగా ఈ ఏకచక్రపురంలో ఉంటున్నాం. ఇంక కొన్నాళ్ళు పోతే మనకిక్కడ భిక్ష దొరకదేమో కూడాను! మనం పాంచాలదేశం పోదామా ఏం? అది చాలా సుభిక్షమైన దేశమట. కాంపిల్యనగరం మహాఅందంగా ఉంటుందట.రాజైన ద్రుపదుడికి బ్రాహ్మణులంటే ఎంతో అభిమానం అని ఇక్కడ ఉన్న వారందరూ అంటున్నారు," అన్నది.

ధర్మరాజు తన తమ్ములతో కూడా సంప్రతించి తల్లి ఆలోచనకు అందరినీ ఒప్పించాడు. వాళ్ళు ఇల్లుగల బ్రాహ్మణుడితో తాము వెళ్ళిపోతున్నట్టు చెప్పి, ఏకచక్రపురం నుంచి బయలుదేరారు.

వాళ్ళు రాత్రీ పగలూ కూడా ప్రయాణం చేస్తూ ఒకనాడు అర్ధరాత్రివేళకు గంగానదీ

తీరాన ఉన్న సోమశ్రవం అనే తీర్థాన్ని చేరుకున్నారు. చీకటిగా ఉన్నది. అందరికన్న ముందు అర్జునుడు ఒక కొరవి పట్టుకుని నడుస్తున్నాడు. గంగలో స్నానం చేయ సంకల్పించి వాళ్ళు నదిని చేరవస్తూండగా, ఆ సమయంలో గంగలో తన భార్యలతో జలక్రీడలాడుతున్న అంగారపర్ణుడనే గంధర్వుడు మనుషుల అలికిడి విని, "ఎవరా వచ్చేది? దూరంగా పొండి. ఈ చుట్టుపక్కల ఉన్న వనమంతా నాది. నేను అంగారపర్ణుడనే గంధర్వుణ్ణి. ఇది యక్ష రాక్షస గంధర్వులు సంచరించే వేళ. మనుషులు సంచరించరాదు," అన్నాడు.

ఆ మాట విని అర్జునుడు, "దుర్మార్గుడా, హిమాలయ ప్రాంతమూ, గంగానదీ ఒకరి సొత్తు ఎలా అవుతాయి? అవి అందరివీనూ. గంగను చూసినప్పుడు, అర్ధరాత్రి అయేది, భోజనానంతరమయేది, విధిగా స్నానం చెయ్యాలి. అందుచేత మేము ఇప్పుడునదిలో స్నానం చెయ్యకుండా ముందుకు పోము," అన్నాడు.

అంగారపర్ణుడికి కోపం వచ్చి బాణాలు వెయ్యసాగాడు. అర్జునుడు తన చేతిలో ఉన్న కొరవితో ఆ బాణాలను అడ్డుతూ, "ఒరే గంధర్వుడా, మమ్మల్ని నీ ముష్టి బాణాలతో బెదిరించటానికి మేమెవరమనుకుంటున్నావు? నీ మాయ మంత్రాలేవీ మా ముందు సాగవు," అంటూ ఆగ్నేయాస్త్రం మంత్రించి ప్రయోగించాడు. దానితో గంధర్వుడి రథం అంతా మండి బూడిద అయి



పోయింది. గంధర్వుడు కిందపడి మూర్ఛ పోయాడు.

ఈ సమయంలో గంధర్వుడి భార్య కుంభీ నసి ధర్మరాజును ఆశ్రయించి, తనకు పతి భిక్ష పెట్టమని వేడుకున్నది.

ధర్మరాజు అర్జునుడితో, "ఈమె మనని శరణుజొచ్చి పతిభిక్ష కోరుతున్నది. ఈమె భర్తను చంపడం ధర్మం కాదు. అందుచేత నువ్వు గంధర్వుణ్ణి చంపకు," అన్నాడు.

అన్న మాట విని అర్జునుడు గంధర్వుణ్ణి ప్రాణాలతో వదిలేశాడు.

గంధర్వుడు అర్జునుడితో, "నీతో ఓడి పోయాను గనక నేను అంగారపర్ణుడనే పేరు వదిలేస్తాను. నువ్వుతగలబెట్టిన రథానికి బదులు మరొక చిత్రరథం సృష్టించుకుని, చిత్రరథుడనే పేరు పెట్టుకుంటాను. మహా వీరుడివైన నీకు చాక్షుషి అనే విద్యను ఇస్తాను. దాని సహాయంతో నీకు మూడు లోకాలలో ఎక్కడ ఏది జరిగేదీ కనిపిస్తుంది. ఈ విద్య మా వద్ద ఉండటం చేతనే దేవతలు సైతం మమ్మల్ని ఏమీ చేయలేకుండా ఉన్నారు. చాక్షుషితో బాటు నీకు కొన్ని దివ్యాశ్వాలను కూడా ఇస్తాను. అంతేకాదు. మీఅన్నదమ్ములు ఒక్కొక్కరికీ ఒక్కొక్క వంద అశ్వాలనిస్తాను," అన్నాడు.

దానికి అర్జునుడు, "ఎంత సన్నిహితుడి వద్ద నుంచి అయినా నేను ఏమీ తీసుకోను," అన్నాడు.



"అలా అయితే నాకు ఏదన్నా ఇచ్చి, దానికి బదులుగా నా నుంచి బహుమానం పుచ్చుకో," అన్నాడు గంధర్వుడు.

గంధర్వుడికి ఆగ్నేయాస్త్రం ఇచ్చి, అతని నుంచి అశ్వాలను పుచ్చుకోవటానికి అర్జునుడు సమ్మతించాడు.

గంధర్వుడు అతనితో, "మీరు క్షత్రియులు. అందుచేత మీరు తగిన పురోహితుణ్ణి ఏర్పాటు చేసుకుని, అతని సలహా ప్రకారం నడుచుకుంటే తప్ప మీకు శుభాలు చేకూరవు," అన్నాడు.

అర్జునుడు అతనికి ఆగ్నేయాస్త్రాన్ని సమంత్రంగా ఉపదేశించి, "ప్రస్తుతం నీ గుర్రాలు నీ వద్దనే ఉండనీ. అవసరం వచ్చి

నప్పుడు తెప్పించుకుంటాను," అని చెప్పి, అతని వద్ద సెలవు తీసుకున్నాడు. పాండవులూ, కుంతీ తమ ప్రయాణం కొనసాగించారు.

పాండవులు గంగాతీరం నుంచి బయలుదేరి ఉత్కోచతీర్థానికి చేరుకున్నారు. అక్కడే ధౌమ్యుడు తపస్సు చేసుకుంటున్నాడు. పాండవులు ఆయనకు నమస్కారం చేసి, తమకు పురోహితుడుగా ఉండమని ప్రార్థించారు. ధౌమ్యుడు పాండవుల ప్రజ్ఞా, పరాక్రమమూ, బలమూ, ఉత్సాహమూ గురించి సరిగా గ్రహించి, తన పౌరోహిత్యానికి వారు అర్హులని భావించి, వారికి అతిథి మర్యాదలు చేసి, వారి కోరిక తీర్చడానికి తన సమ్మతి తెలిపాడు. ఆయన తమకు పురోహితుడుగా ఉండటానికి ఒప్పుకోగానే పాండవులు భూమండలానికంతకూ తామే రాజులయినంతగా ఆనందోత్సాహంతో పొంగిపోయారు.

అదే సమయంలో కొందరు ద్రౌపదీ స్వయంవరం చూడటానికి కాంపిల్యనగరానికి పోతూ ధౌమ్యుడుండే ఆశ్రమానికి వచ్చారు. వారిని చూసి పాండవులు, తాము కూడా తల్లినీ, ధౌమ్యుణ్ణీ వెంటపెట్టుకుని ద్రౌపదీ స్వయంవరోత్సవాన్ని చూసి ఆనందించాలన్న కోరిక వెలిబుచ్చారు. బ్రాహ్మణ వేషాలు ధరించి ఉన్న పాండవులను చూసి ఆ బ్రాహ్మణులు, "మీరు ఎక్కడి నుంచి వచ్చారు? ఎక్కడికి పోతున్నారు?" అని అడిగారు.

"మేము ఏకచక్రపురం నుంచి కాంపిల్య నగరానికి ప్రయాణమై వెళుతున్నాం," అన్నాడు ధర్మరాజు.

"మేమూ అక్కడికే పోతున్నాం. అక్కడ ద్రుపదుడి కుమార్తెకు స్వయంవరం జరుగుతున్నది. ఆమె చాలా చక్కనిదట. స్వయంవరానికి ఎందరో రాజులు వస్తున్నారట. అది చూడవచ్చే బ్రాహ్మణులకు ఆ మహారాజు గోదానమూ, సువర్ణదానమూ, అన్నదానమూ చేస్తున్నాడు. పెళ్ళి వేడుక చూసి మళ్ళీ తిరిగి వస్తాం," అన్నారు బ్రాహ్మణులు.

పాండవులూ, కుంతీ కూడా వారి వెంట దక్షిణ పాంచాలంలోని కాంపిల్యనగరానికి బయలుదేరారు.



# పాలసంపెంగ

పరిశీలనగా చూడకుండా యథాలాపంగా వెళుతున్నా రంగు రంగుల పూలతో మన దృష్టిని ఆకర్షించే చెట్లు కొన్ని ఉన్నాయి. అటువంటి చెట్లలో పాలసంపెంగ ముఖ్యమైనది. ఈ చెట్లు దేవాలయాలలో ఎక్కువగా ఉంటాయి.కాబట్టి వీటిని ఆలయవృక్షాలు అని అంటారు. హిందువులు ఈ పూలను పూజకు ఉపయోగిస్తారు. ఈ చెట్లు అన్ని చోట్ల పెరగడం వల్ల బౌద్ధులు వీటిని మరణం లేని చెట్లుగా, అమరత్వానికి చిహ్నంగా భావిస్తారు. ఈ చెట్లను శ్మశానవాటికలలో కూడా నాటి పెంచుతారు.

ఆరు మీటర్ల ఎత్తు వరకు ఎదిగే ఈ చెట్టు కొమ్మలు నేలబారుగా ఉంటాయి. చెట్టు ప్రధాన కాండం వంగి, వంపులు తిరిగి ఉంటుంది. చెట్టు ఆకులను తుంచినా, చెట్టు కాండానికి గాటు పెట్టినా చిక్కటి పాల వంటి ద్రవం కారుతుంది. ఈ చెట్టును వృక్ష శాస్త్రంలో 'ఫ్రాంగి పానీ' అని అంటారు. ఈ పేరు రావడానికి రకరకాల కారణాలు చెబుతారు. ఈ చెట్టు నుంచి పాలు కారడం వల్ల, దానిని ఫ్రెంచి వాళ్ళు మొదట ఆ పేరుతో పిలిచారనీ, ఒక ఇటలీ దేశస్థుడు ఈ పూల పరిమళంతో వాసన తైలాన్ని తయారు చేశాడనీ అతని పేరు మీదుగా దానికా పేరు వచ్చిందనీ చెబుతారు. హిందీలో దీనిని చాప్లీ అనీ, గుల్‌చిన్ అనీ, అస్సామీలో గోలంచీ అనీ, తమిళంలో కళ్ళి మందారై అనీ, కన్నడంలో కాడుసంపగ అనీ, మరాఠీలో ఖైర్ చంప అనీ, ఒరియాలో గొలుచీ అనీ, బెంగాలీలో గొరూర్ చంప అనీ, సంస్కృతంలో క్షీరచంప అనీ అంటారు. తెలుగులో దీనికి నులువరహాలు అనే మరొక పేరు కూడా ఉన్నది.

వీటి ఆకులు వెడల్పుగానూ, మందంగానూ, పొడవుగానూ, రెండువైపులా మొనదేలి ఉంటాయి. పూలు పూచినప్పుడు చూడడానికి చాలా మనోహరంగా ఉంటాయి.

ఈ చెట్ల ఆకులనూ, పువ్వులనూ, చెట్టు నుంచి కారే తెల్లటి ద్రవాన్నీ వివిధ ఔషధాలలో, తైలాలలో ఉపయోగిస్తారు. వీటి బెరడును కూడా కొన్ని చర్మవ్యాధులు నయం చేయడానికి ఉపయోగిస్తారు.

ఈ చెట్లను అలంకార వృక్షాలుగా కూడా నాటి పెంచుతారు.



మనదేశపు ఋషులు : 4

# ఉద్దాలకుడు



వేద మంత్రాలను శిష్యులకు చక్కగా వివరించి బోధించిన మన ప్రాచీన ఋషి పుంగవులలో ఉద్దాలకుడు ముఖ్యుడు. అరుణుడి కుమారుడు కావడంవల్ల ఆయనకు అరుణి అనే పేరు కూడా ఉన్నది.

అరుణి పసిప్రాయంనుంచే విద్య పట్ల శ్రద్ధాసక్తులూ, గురువుపట్ల భయభక్తులూకలిగి ఉండేవాడు. ఆయన విద్యనభ్యసించడానికి ధౌమ్యుడికి శిష్యుడిగా ఆయన ఆశ్రమంలో చేరాడు. ఆశ్రమ సమీపంలో ఒక చెరువూ, కొంత పాలమూ ఉండేది. అరుణి ధౌమ్యుడి వద్ద విద్యాభ్యాసం చేసే ఉత్తమ శిష్యులలో ఒకడుగా పేరు తెచ్చుకున్నాడు. భక్తితో గురుశుశ్రూష చేస్తూ ఏకాగ్ర చిత్తంతో వేద వేదాంగాలను అకళింపు చేసుకోవడానికి అరుణి నిరంతరం ప్రయత్నించేవాడు.

ఒకనాటి రాత్రికుండపోతగా వర్షం ప్రారంభమయింది. ఆశ్రమానికి సమీపంలో ఉన్న చెరువు కింద ఆశ్రమానికి చెందిన పొలం ఉన్నది. పొలంలో పంట పచ్చగా కళకళ లాడుతున్నది. వర్షం ఎక్కువయితే, చెరువు గట్టు తెగి పంట మునిగిపోతుందేమోనని గురువు భయపడిపోతూ, ఏమి చేయడానికీ తోచక దిగులు చెందసాగాడు. అప్పుడు అరుణి, "గురుదేవా! కరుణించి నన్ను అక్కడికి వెళ్ళడానికి అనుమతించండి. నేను వెళ్ళి పరిస్థితిని చక్కదిద్దుతాను," అని వేడుకున్నాడు.

అప్పుడు వర్షం కొంత తగ్గినట్టు కనిపించడంతో, గురువు అరుణిని వెళ్ళిరమ్మన్నాడు.

అరుణి పొలం దగ్గరికి వెళ్ళాడు. పొలం దగ్గర ఉన్న చెరువుగట్టుకు చిన్న గండి పడి ఉండడం గమనించాడు. దానిగుండా కొద్ది కొద్దిగా నీళ్ళు బయటికి వస్తున్నాయి. కొంత సేపు చుట్టుపక్కల కలయజూసి, దగ్గర ఉన్న మట్టిని తీసి గండికి అడ్డుగా వేసి నీటినిఆపడానికిప్రయత్నించాడు. కాని అతడు వేస్తున్న మట్టితో గండి పూడ్చుకు పోలేదు. వేసిన మట్టి వేసినట్టు నీళ్ళతో కొట్టుకుపోవడంతో క్రమక్రమంగా ప్రవాహం ఎక్కువ కాసాగింది. పరిస్థితి విషమించగలదని గ్రహిం

చిన అరుణి వెంటనే గండికి అడ్డంగా పడుకున్నాడు. నీళ్ళు బయటకు రావడం ఆగిపోయింది కాని, భరించలేని చలికి తోడు వర్షం మళ్ళీ ఆరంభమయింది. అరుణి మాత్రం పడుకున్నచోటు నుంచి అటూ ఇటూ కదలలేదు. కొంతసేపటికి స్పృహ కోల్పోయాడు.

అరుణి ఎంతసేపటికీ తిరిగి రాకపోవడంతో, ఆశ్రమంలోని ధౌమ్యుడు ఆందోళన పడసాగాడు. ఏమయిందో అన్న ఆతురతకొద్దీ కొందరు శిష్యులను వెంటబెట్టుకుని ఆయన బయలుదేరాడు.

వాళ్ళు తెల్లవారుతూండగా చెరువుగట్టును సమీపించారు. అక్కడ గండికి అడ్డంగా పడివున్న అరుణిని చూసి అమితాశ్చర్యంచెందారు. శిష్యులు పక్కన ఉన్న మట్టిని తెచ్చి అడ్డంగా వేస్తూన్నప్పుడే గురువు అరుణిని పైకి ఎత్తాడు. అతన్ని ఆశ్రయానికి మోసుకువచ్చి అగ్నిగుండం ముందు ఉంచారు. కొంతసేపటికి అతనికి స్పృహ వచ్చింది.

గురువు అతని కేసి అభిమానంగా చూస్తూ, "అరుణీ, ఈ రోజుతో నీ విద్యాభ్యాసం సంపూర్ణమయిందని నిరూపించావునాయనా!" అన్నాడు.

అరుణి వేదవేదాంగాలు నేర్చిన పండితుడయినప్పటికీ,అవసరమైనప్పుడు శరీరశ్రమ చేయడానికి ఏమాత్రం వెనుకాడలేదు. పదిమంది మేలుకోరి తన ప్రాణత్యాగం చేయడానికి కూడా సిద్ధమయ్యాడు. పైగా తాను అలా చేయడంచాలా గొప్పవిషయం అని గర్వపడలేదు.అదితన బాధ్యతగా భావించి వినయం చూపాడు. అందుకే గురువు అతన్ని అలా మెచ్చుకున్నాడు.

అరుణి ఉత్తరోత్తరా ఉద్దాలకుడనే ఉత్తమ గురువుగా శిష్యుల గౌరవాభిమానాలకు పాత్రుడై కీర్తిగాంచాడు.



# మీకు తెలుసా?

1. ఖజురహో ఆలయాలు మన దేశంలో ఏ రాష్ట్రంలో ఉన్నవి?
2. మొట్టమొదటి జలాంతర్గామిని రూపొందించిన వారెవరు?
3. మీగడ, పాలు ఈ రెండింటిలో బరువైనది ఏది?
4. శిక్కుల పవిత్ర గ్రంథం ఏది?
5. నోబెల్ బహుమతిగ్రహీతలలో అతి పిన్నవయస్కుడు ఎవరు?
6. 'సాల్ట్‌లేక్' అని పిలువబడే స్టేడియం ఎక్కడ ఉన్నది?
7. పిచ్చికుక్క కాటుకు టీకాలు కనుగొన్న వారెవరు?
8. పిల్లిజాతి జంతువుల పంజాలన్నింటికీ రక్షణ కవచాలు ఉంటాయి. ఒక జంతువుకు మాత్రం ఉండదు. అది ఏది?
9. క్యాలండర్ పద్ధతిని మొట్టమొదట ప్రవేశ పెట్టిన దేశం ఏది?
10. మనదేశంలో యేటా 'నెహ్రూ పడవల పోటీ' ఎక్కడ జరుగుతాయి?
11. ఒక నగరం 13 దీవుల మీద నిర్మించబడింది. కాబట్టి దానిని 'జలనగరం' అని అంటారు. ఆ నగరం ఏది?
12. మొట్టమొదటి పీష్వా ఎవరు?
13. రోమ్ నగరం ఏ నది తీరంలో ఉన్నది?
14. మొట్టమొదటి వ్యోమనౌక ఏది? ఎప్పుడు ప్రయోగించారు?
15. పదేళ్ళ క్రితం ప్రపంచ చెస్ ఛాంపియన్ ఎవరు?
16. గబ్బిలం ఎంత వేగంగా ఎగర గలదు?
17. 'థాయ్‌ల్యాండ్' పూర్వనామం ఏమిటి?
18. ఆడ కాటుకపక్షి (బ్లాక్‌బర్డ్) రంగు భిన్నంగా ఉంటుంది? ఆ రంగు ఏది?
19. గాలి కోసం బయటికి రాకుండా తిమింగిలం నీటి అడుగున ఎంతసేపు ఉండగలదు?
20 చైనా 'కరెన్సీ' ఏమిటి?

# సమాధానాలు

1. మధ్యప్రదేశ్.
2. కార్నీలియస్ వాన్ డ్రెబెల్.
3. పాలు.
4. ఆదిగ్రంథ్, గ్రంథ్‌సాహెబ్ అనీ అంటారు.
5. విలియం లారెన్స్ బ్రాగ్.
6. కలకత్తాలో.
7. లూయీ పాశ్చర్.
8. చిరుతపులి.
9. ఈజిప్టు.
10. కేరళ రాష్ట్రం అలెప్పీ సమీపంలోని వున్న మూన్నాలో.
11. స్టాక్‌హోమ్.
12. బాలాజీ విశ్వనాథ్ (1713 నుంచి 1720వరకు పాలించాడు).
13. టైబర్ నది.
14. స్పుట్నిక్ I; 1957లో.
15. అంటోలీ కార్పోవ్.
16. గంటకు దాదాపు 60 కి.మీ.
17. సయాం.
18. గోధుమ రంగు.
19. 20 నిమిషాలు.
20. యువాన్.



# మంచివాళ్ళ హాస్యం

ప్రఫుల్లుడనే ధనవంతుడిది వక్రబుద్ధి. సుఖంగా, సంతోషంగా వున్నవారిని బాధపెట్టి వినోదించడం ఆయన అలవాటు. ఆ అలవాటుకు భయపడి, ఆయన భార్య ఊర్మిళ కూడా ఎప్పుడూ లేనివిచారాన్ని నటిస్తూ దిగులుగా వుండేది.

ఈ విషయం ఊర్మిళ అన్న భూషణానికి తెలిసింది. బావగారిని సరైన మార్గంలో పెట్టాలని అతడొకసారి చుట్టపు చూపుగా ప్రఫుల్లుడింటికి వెళ్ళాడు. ప్రఫుల్లుడు, భూషణాన్ని అభిమానంగా ఆహ్వానించి, తానెవరెవరిని ఎలా బాధపెట్టిందీ చెప్పి గలగలా నవ్వాడు.

భూషణం ఆయన చెప్పేదంతా విని, "నువ్వు చెప్పేది వింటూంటే నాకు నవ్వు రావడంలేదు సరికదా, ఎంతో దిగులుగా వుంది. మరి, నువ్వెందుకు నవ్వుతున్నట్టు?" అన్నాడు.

"హాస్యాన్ని వినోదించడం ఒక కళ. అది అందరికీ అబ్బదు. రేపు సభకు రా! ఇప్పుడు నేను చెప్పిన కథలకు సభికులందరూ ఎలా నవ్వుతారో చూద్దువుగాని," అన్నాడు ప్రఫుల్లుడు.

మర్నాడు సభలో ఆయన చెప్పిన కథలకు నిజంగానే సభికులందరూ విరగబడి నవ్వారు.

భూషణం ఆశ్చర్యపడి, ఇంటికి తిరిగి వచ్చాక ఊర్మిళను కారణమడిగాడు. ఊర్మిళ నిట్టూర్చి, "నవ్వకేం చేస్తారు? నవ్వని వారికి కొరడా దెబ్బల శిక్ష వుంటుంది కదా!" అన్నది.

"నీ భర్త ఏమైనా మహారాజా? కొరడా దెబ్బలు కొడితే సభికులూరుకుంటారా?" అన్నాడు భూషణం మరింత ఆశ్చర్యంగా.

"ఆ సభికులందరూ పేదవాళ్ళు. ఎన్ని మాటలన్నా పడడానికీ, ఏం చెప్పినా విని నవ్వడానికీ, మీ బావగారు డబ్బిస్తాడు. అలా ఇష్టపడినవాళ్ళే సభకు వస్తారు. అంతా డబ్బు మహిమ!" అన్నది ఊర్మిళ.

శ్రీరామకమల్



విషయం తెలిశాక భూషణం, ప్రఫుల్లుడు ఒంటరిగా వున్నప్పుడు, "పాపం నీకు హాస్యమంటే తెలిసినట్టులేదు. నీవంటివాడితో వుండడం వల్లనే నీ ఇంట్లో పనివాళ్ళు, నీ భార్య ఎప్పుడూ దిగులుగా వుంటున్నారు," అన్నాడు.

"ఆఁ, వాళ్ళవి ఏడుపుగొట్టు ముఖాలులే! నేనెంత హాస్యంగా మాట్లాడతానో నువ్వు సభలో స్వయంగా చూశావు గదా!" అన్నాడు ప్రఫుల్లుడు.

"హాస్యమంటే డబ్బిచ్చి నవ్వించడం కాదు. వినగానే ఏడుపు ముఖం వాళ్ళకు కూడా నవ్వు పుట్టాలి," అన్నాడు భూషణం.

ఇది వింటూనే ప్రఫుల్లుడు గతుక్కుమని, "ఆహాఁ, అసలు సంగతి తెలుసుకున్నావన్న మాట! సరే పోనీ, నువ్వు డబ్బిచ్చి నవ్వించగలవా?" అన్నాడు సవాలు చేస్తున్నట్టుగా.

"నేను నవ్వగలను కానీ నవ్వించలేను. నవ్వించడం ఒక గొప్ప కళ. మా ఊళ్ళో చతురుడని ఒక యువకుడున్నాడు. వాడు కబుర్లు చెబితే మొసలికి కన్నీళ్ళు కూడా సంతోషం వల్లనే వస్తాయి," అన్నాడు భూషణుడు.

"అలా అయితే వాణ్ణి పిలిపించు," అన్నాడు ప్రఫుల్లుడు.

మర్నాటికల్లా భూషణం పిలుపునందుకుని, చతురుడు వచ్చాడు. ప్రఫుల్లుడు వాణ్ణి పలకరించి, "నవ్వించడంలో నీ అంతటి వాడు లేడటగా – మా బావమరిది చెప్పాడులే! నిన్ను పరీక్షిద్దామని రమ్మన్నాను. పరీక్ష కాస్త కఠినంగా వుంటుంది మరి, తట్టుకోగలవా?" అని అడిగాడు.

వెంటనే చతురుడు కడుపు పట్టుకుని ఆగకుండా నవ్వాడు.

"ఎందుకలా నవ్వుతావు?" అన్నాడు ప్రఫుల్లుడు చిరాగ్గా.

"మీరు ప్రతి మాటా హాస్యంగా అంటారని భూషణం గారు చెప్పారు. ఇది హాస్యమేమో అనుకుని నవ్వాను," అన్నాడు చతురుడు.

"ఏమో అనుకుని నవ్వడమేమిటి? నీకు హాస్యం అర్థం కాదా?" అన్నాడు ప్రఫుల్లుడు.

"కాకేం, అర్థమవుతుంది. కానీ, నన్ను పరీక్షించే వారిని మంచి చేసుకోవాలి కదా! అందుకని నవ్వాను," అన్నాడు చతురుడు.

ఈ మాటలు వింటూ భూషణం, ఊర్మిళ మాత్రమే కాక, అక్కడ వున్న ఇద్దరు పనివాళ్ళు కూడా నవ్వడంతో ప్రఫుల్లుడు చిరాకుపడి, "అర్థం లేని మాటలకు నవ్వారంటే కొరడా దెబ్బలు పడతాయి, జాగ్రత్త!" అన్నాడు.

వెంటనే భూషణం, "బావా! రేపు సభ ఏర్పాటు చెయ్యి. చతురుడి మాటలకు నవ్వని వాళ్ళకు డబ్బిస్తానను. నవ్వినవాళ్ళను కొరడా దెబ్బలతో శిక్షిస్తానను. అయినా చతురుడు అందర్నీనవ్విస్తాడు. ఇదీ నాపందెం!" అన్నాడు.

ఇందుకు ప్రఫుల్లుడాశ్చర్యపడి సరేనన్నాడు. అప్పుడు చతురుడు, "అయ్యా! నాదొక్క మనవి. హాస్యం కోసం నేనక్కడ ఏమేమోఅంటాను. నేనేమన్నా మీరు మాత్రం మాట్లాడకూడదు," అంటూ తన షరతు చెప్పాడు.

ప్రఫుల్లుడందుకు అంగీకరించి మర్నాడు సభ ఏర్పాటు చేశాడు. పందెం సంగతి తెలియడం వల్ల సభకు ఎప్పటికంటే ఎక్కువగా జనం వచ్చారు.

చతురుడు సభికులందరి ముందూ నిలబడి, "అయ్యలారా! భగవంతుడు నాకు నవ్వించే శక్తినిచ్చాడు. నవ్వు సంతోషం వల్ల వస్తుందంటారు. సంతోషమే సగం బలం అని సామెత. అంటే -- మనిషికి సగం బలం నవ్వులో వుందన్న మాట. అయితే, నవ్వు నాలుగువిధాల చేటన్న సామెత కూడా వుంది. మీ అందరికీ నవ్వు కనీసం రెండు విధాల చేటు. ఒకటి – వచ్చే డబ్బులు పోతాయి. రెండు – కొరడా దెబ్బల శిక్ష. అంటే, నా నవ్వు చివరకు మిమ్మల్నేడిపిస్తుంది. నవ్వించి





పుట్టి గుసగుసలు ప్రారంభమయ్యాయి. ఉన్న ట్లుండి మూక ఉమ్మడిగా సభికులంతా నవ్వ సాగారు. కొంతసేపు సభ వారి నవ్వులతో ప్రతి ధ్వనించిపోయింది.

అప్పుడు చతురుడు ఆశ్చర్యంగా సభికుల వంక చూసి, "అయ్యలారా! నేనింకా హాస్యో క్తులు ప్రారంభించనే లేదు. మీరెందుకు నవ్వినట్టు?" అని అడిగాడు.

సభికులలో ఒకడు లేచి నిలబడి, "మేము నవ్వితే అందరికీ తలా ఒక కొరడా దెబ్బ పడుతుంది. ఆ మాత్రం శిక్ష మేము భరించ గలం. మీలాంటి ఒక్క మనిషి అన్ని కొరడా దెబ్బలు తింటూంటే చూస్తూ భరించలేం. అందుకే నవ్వాం. మా నవ్వు నిన్ను దెబ్బల బారి నుంచి రక్షిస్తుందంటే, అదే మాకు తృప్తి!" అన్నాడు.

ఇది విని ప్రఫుల్లుడు తెల్లబోయాడు. ఈ లోగా చతురుడు సభికులతో, "మనిషిలో వుండే మానవత్వం డబ్బుకు లొంగదు. శిక్షకు భయపడదు. ఇది తెలియజెప్పాలనే నేను, ముందు మీతో అలా అన్నాను తప్పితే – మీ ప్రఫుల్లుడిలోనూ బోలెడు మానవత్వముంది. ఆయన నన్ను శిక్షించడం అబద్ధం. మిమ్మల్ని శిక్షించడం మాత్రం నిజం. మీకు ఒక్క కొరడా దెబ్బను తట్టుకునే శక్తి వుందని నాకిప్పుడు తెలిసింది. కాబట్టి ఇక ఏమాత్రం సందేహిం చకుండా హాస్యోక్తులు ప్రారంభిస్తాను," అన్నాడు.

ఏడ్పించడం నాకిష్టముండదు. ఇంతమందిని ఏడ్పించడానికి బదులు నేనొక్కణ్ణీ ఏడ్వడం మంచిది కదా! మిమ్మల్ని నవ్వించనందుకు, మీరెందరున్నారో అన్ని కొరడా దెబ్బలు నేను తినాలి. మీలో ఒకరు ముందుకు వచ్చి సభి కులను లెక్కపెట్టండి!" అన్నాడు.

చతురుడిలా అంటాడని తెలియని ప్రఫు ల్లుడు తెల్లబోయాడు. సభలో సుమారు రెండు వందల మందయినా వుంటారు. వాళ్ళలో కొందరిని నవ్వించినా చతురుడికి కొన్ని కొరడా దెబ్బలు తప్పేవి. వాడలా ఎందుకు చేశాడా అని, ఆలోచనలో పడ్డాడు ప్రఫుల్లుడు.

అయితే, అంతలో ఆయన ఊహించని విచిత్రం జరిగింది. సభలో చిన్న కలకలం

"అబద్ధం! సభికులు నవ్వకపోతే చతురుణ్ణి శిక్షించి తీరుతాను!" అంటూ ప్రఫుల్లుడు ఆవేశంగా అనబోతూంటే భూషణం వారించి, "బావా! అతడేమన్నా నువ్వు మాట్లాడకూడదన్న అతని షరతును మరిచిపోయావా? అయినా సభికు లందరూ ఎప్పుడో నవ్వారు," అన్నాడు.

ప్రఫుల్లుడు మరి మాట్లాడలేకపోయాడు. అప్పుడు చతురుడు సభికులకు ప్రఫుల్లుడి కథనే హాస్యంగా చెప్పడం మొదలుపెట్టాడు: "అంతా ఆయనను ముఖం మీద ఏమం టారో, అదే నిజమని నమ్ముతాడట! దేవుడు ప్రత్యక్షమై వరమిస్తానంటే – తనను ఎరిగిన వాళ్ళందరూ తనకేం జరగాలని కోరుకుంటే, అదే జరగాలని కోరాడట. అప్పటి నుంచీ ఆయన బాటమీద జారి పడిపోతున్నాడట. బట్టలు ముళ్ళకంచెలకు తగులుకుని చీరుకు పోతున్నాయట. ఊరకుక్కలాయనను వెంట బడి తరుముతున్నాయట. పాలేళ్ళాయన చేత పొలం పనులు చేయిస్తున్నారట. ఆఖరికాయన బండి ఎద్దు, ఆయనను బండికి కట్టి తను బండి ఎక్కి కూర్చున్నదట!" ఇలా ఆయనపడే అవస్థలను చతురుడు వర్ణించి చెబుతూంటే, సభికులు సర్వం మరిచి పొట్టలు పట్టుకుని నవ్వసాగారు.

అప్పుడు ప్రఫుల్లుడు తన ఓటమిని ఒప్పు కుంటూనే, "హాస్యమంటే అందరినీ సంతోష పరచాలి. నీ హాస్యం నన్ను బాధపెట్టింది," అన్నాడు.

"వక్రబుద్ధులనూ, చెడ్డతనాన్నీ చీదరించు కోవడంలో ఎంతో హాస్యముంది. ఆ హాస్యం చెడ్డవాళ్ళను మాత్రమే బాధపెట్టి, మంచివా ళ్ళందరికీ సంతోషాన్నిస్తుంది. ఆ సంతోషాన్ని పొందడం కోసం మనిషి చెడ్డతనాన్ని విడిచి పెట్టి మంచివాడుగా మారాలి," అన్నాడు చతురుడు.

తన చెడ్డతనం వల్ల తనకేమేం జరిగితే జనం సంతోషిస్తారో అర్థం కావడంతో, ప్రఫు ల్లుడు బుద్ధి తెచ్చుకుని మంచివాడుగా మారాడు. అందుకు కారణమైన చతురుడికి తగిన సత్కారం చేసి, భూషణానికి కృతజ్ఞతలు తెలుపుకున్నాడు.





# వ్యర్థ వరాలు

ఒక గ్రామంలో అడవికి సమీపంగా ఒక కట్టెలుకొట్టేవాడు భార్యతో సహా ఒక గుడిసెలో నివసిస్తూ ఉండేవాడు. కావటానికి పేదవాళ్ల యినా ఇద్దరూ కష్టంచేసి జీవించినా, వాళ్ళకు రోజులు సుఖంగానే జరుగుతూ ఉండేవి.

అయితే వాళ్ల గుడిసెకు సమీపంలోనే కొందరు సంపన్నులు ఇళ్ళు కట్టారు. వాళ్ళు తమకన్న సుఖంగా బతకటం చూసినాక ఈ దంపతులకు కొంచెం కన్నుకుట్టింది.

ఒకనాడు రాత్రి గుడిసెలో కూర్చుని భార్యా భర్తలు ఈవిషయమేమాట్లాడుకుంటున్నారు. "కొందరు పెట్టి పుట్టుతారు. మనక్కూడాఇంత డబ్బుంటేచక్కగాకావలసిందెల్లా కొనుక్కుని ఎంత హాయిగా ఉండేవాళ్ళం!" అన్నది భార్య విచారంగా.

"నన్నడితే ఈ భాగ్యవంతులకు సుఖపడ టంతెలీదు. నాకేఅంత డబ్బుంటేనా, ఎంత సుఖపడేవాణ్ణో!" అన్నాడు కట్టెలు కొట్టేవాడు.

"వెనకటి రోజుల్లో దేవతలు కనబడి కోరిన వరాలిచ్చే వాళ్ళుట. ఎవరైనా దేవత వచ్చి మనని వరాలు కోరుకొమ్మంటే ఎంత బాగుండును!" అన్నది భార్య.

ఆమె మాట ఇంకా పూర్తి కాకముందే ఆ గుడిసెలో అకస్మాత్తుగా ఒక స్త్రీ ప్రత్యక్ష మయింది. ఆమెను చూడగానే దేవత అనీ, మామూలు మనిషి కాదనీ తెలిసిపోతున్నది.

"నేను దేవతను. వరాల కోసం మీరు తహతహలాడుతున్నారు గనక, మీకు మూడే మూడు వరాలిస్తున్నాను. ఆపైన మీరు కోర వద్దు. వాటితో తృప్తి పడండి," అని ఆ దేవత అంతర్ధానమయింది.

ఈ సంఘటనకు నిర్ఘాంతపోయిన ఆ పేదదంపతులు, దేనికోసం కోరుకోవాలో ఒకం తట నిర్ణయించుకోలేక తికమక పడ్డారు.

"నన్నడిగితే, మనం కూడా ధనవంతులమై, గొప్పవాళ్లలాగా ఉండాలని కోరుకోవటం చాలా

మంచిదంటాను," అన్నది భార్యఎంతో ఉత్సాహంగా.

"నీ మొహం! డబ్బున్నంత మాత్రాన రోగాలూ రొష్టులు రావా, దొంగలు పడి చావగొట్టరా? అందువల్లఆరోగ్యమూ, దీర్ఘాయువూ ఉంటే చాలా నయం," అన్నాడు భర్త.

"చిరకాలం బతికిఏం లాభం? బీదరికంతో మరింత కాలం తీసుకోవటానికా?" అన్నది భార్య కోపంగా.

"అదీ నిజమే మరి. తొందర వద్దు. ఆలోచించి మరీ కోరుకుందాం వరాలు!" అన్నాడు భర్త.

భార్య వంట చెయ్యటానికి నిప్పు రాజేస్తూ, "ఈ పూట కూరకు చేపలుంటే ఎంత బాగుండేది!" అన్నది.

ఆమె అలా అనటమే తడవుగా పైనుంచి కొన్ని చేపలు ఆమె ముందు పడ్డాయి.

మూడు వరాలలోనూ ఒకటి తీరిందని గ్రహించి భర్త, "ఎంతపని చేశావే పాపిష్టి దానా? వెధవ కోరిక కోరితివే? ఇంతకన్న ఈ చేపలన్నీ నీ మెళ్ళో హారంగా పడాలని కోరుకోకపోయావూ? బాగుండేది!" అన్నాడు మండిపడుతూ.

మరుక్షణంలో ఆ చేపలన్నీ ఒక హారంగా ఏర్పడి, భార్య మెడను అలంకరించాయి.

"నువ్వు చేసిన నిర్వాకం మాత్రం ఏమిటి? నేనొక వరం పాడుచేస్తే నువ్వు మరొకటి పాడు చేశావు," అంటూ ఆమె ఆ చేపల హారాన్ని తన మెడలో నుంచి తీయటానికి ప్రయత్నించింది. కాని ఆ చేపల హారం ఆమె ఒంటికి అంటుకుపోయి ఊడిరాలేదు. భర్త కూడా దాన్ని తీయలేకపోయాడు.

"ఛీ, ఛీ! చేపలు కూరవండుకు తినడానికి కూడా లేకుండా చేశావు. ఇది ఊడిరాకపోతే నేను ఉరి పోసుకు చస్తాను. వరాలు లేకపోతే పీడాపోయింది. ఈ అవమానం భరించ లేను," అన్నది భార్య.

చేసేది లేక, కట్టెలు కొట్టేవాడు తన భార్య మెడలోని హారం ఊడి రావాలని కోరుకున్నాడు. వెంటనే చేపల హారం ఊడి వచ్చింది. భార్యాభర్తల మూర్ఖత్వం వల్ల మూడో వరం కూడా వ్యర్థమై పోయింది.



Say "Hello" to text books and friends
'Cause School days are here again
Have a great year and all the best
From Wobbit, Coon and the rest!






SUPER
RUBBER




THE

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1995 ఆగష్టు నెల సంచికలో ప్రకటింపబడును.


Mahantesh C. Morabad


Mahantesh C. Morabad

*పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * జూన్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. *మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. *వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : గతి తప్పని పక్షులు! రెండవ ఫోటో : గత చరిత్రకు సాక్షులు!

పంపినవారు : ఆర్. శ్రీజ్యోతి W/o, ఆర్. విశ్వేశ్వరరావు. టెలిఫోన్ సూపర్‌వైజర్,

బ్యాంకు కాలనీ, జేవియర్ నగర్, ఏలూరు – 534 006

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 60.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.




# చందమామ

మహోన్నతమైన భారతీయ సంస్కృతిని — నెలనెలా మనోహరమైన కథల ద్వారా విశదీకరిస్తుంది.

64 పేజీల నిండా అందమైన వర్ణ చిత్రాలతో, సుప్రసిద్ధ పౌరాణిక గాథలను, అద్భుతమైన దేశ విదేశ జానపద కథలను — రసవత్తరమైన చారిత్రక అంశాలను, మహనీయుల జీవిత విశేషాలను — విజ్ఞాన వినోదాలు విరజిమ్మే వివిధ శీర్షికల ద్వారా అందజేస్తుంది.

**11 భారతీయ భాషలతో పాటు, సంస్కృతంలోనూ వెలువడుతున్నది.**

చందా వివరాలకు రాయండి :

డాల్టన్ ఏజన్సీస్, 188, ఎన్.ఎస్.కె. రోడ్ మద్రాసు - 600 026.